


## రసప్రియ రామాయణం

# అయోధ్యాకాండ

## గేయకావ్యం



"రసప్రియ"

ఫోతేదార్ కేశవాచార్య

అయోధ్యాకాండ గేయకావ్యం / రసప్రియ

భోజ ప్రచురణ : 14

ప్రథమ ముద్రణ : 500 ప్రతులు

వృషనామ సం॥ శ్రీరామనవమి - 2001.





**వెల రూ॥ 50/-లు**

ప్రతులకు :

'రసప్రియ' **F. కేశవాచార్య**

H.No.6-2-23/A. తుమ్మలగడ్డ బజార్,

ఖమ్మం - 507 001.

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**

4-1-435 విజ్ఞాన్ భవన్, బ్యాంకుస్ట్రీట్,

హైదరాబాద్ - 500 001.

**నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,**

సుల్తాన్ బజార్, హైదరాబాద్

**స్టూడెంట్స్, బుక్ సెంటర్,**

బస్టాండ్ ఎదురుగ, ఖమ్మం.

ముద్రణ : శివశ్రీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,

ఓల్డ్‌క్లబ్ రోడ్, ఖమ్మం. ఫోన్ : 23976

# అంకితం



శ్రీ కళ్యాణ ప్రదుండు
శ్రితజనాళి మందారుడు
ఇహపరముల కటాక్షించు
మహనీయ గుణాత్ముండును

వామాంకము నందు సీత
వామ కరంబున చక్రము
దక్షిణ హస్తాన శంఖు
లక్ష్మణుండు వామదిశను

శ్రీమన్నారాయణుడే
సీతాలక్ష్మణుల గూడి
జగమునెల్ల నుద్ధరింప
చతుర్భుజుడుగా వెలసిన

భద్రాచల రామచంద్ర
పరబ్రహ్మ చరణయుగ్మ
సాన్నిధ్యమునకు ఈకృతి
సమర్పింతు నంకితముగ

మ॥ నవతా మానవతా సుధామధుర
వీణానాద సంగీత సం
స్తవ సన్మంగళ విశ్వమానవ కళా
సాహిత్య సంధాన స
త్కవితాగాన రసప్రసంగ విలసత్
గంగాతరంగోజ్వలో
ద్భవ వాగ్లక్ష్మినొసంగు భద్రగిరి
సీతారామచంద్ర ప్రభూ!

— నా భద్రగిరి శతకము నుండి.



కేశవచార్య దంపతులు

# కృతజ్ఞతావిష్కరణ

నాయీ గ్రంథముద్రణకు ఆర్థిక సహాయం అందించిన దాతలు ధార్మిక సాహిత్యాభిమానులు అందరికీ నా కృతజ్ఞతలు వారికి సమస్తలోక కళ్యాణ ప్రదాతలు శ్రీ సీతారాములు సకల శుభములను ప్రసాదింతురుగాక !

నాయీ కావ్యానికి తమ అమూల్యమైన అభిప్రాయముల ననుగ్రహించిన విశ్వవిఖ్యాత విద్వన్మణులు శ్రీవాసిలి వేంకట నరసింహరావు గారికి, శ్రీ కోదండ రామాచార్యుల వారికి, శ్రీ సుచంద్ర గారికి సవరణలు సూచించిన శ్రీ కపిలవాయి లింగమూర్తిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందన మందారాలు.

ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ వేణుగోపాలరావు, ప్రొప్రైటర్, శివశ్రీ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, ఖమ్మం వారికి అభినందన చందనాలు.... — రచయిత

## ఈ గ్రంథముద్రణకు ధనసహాయమందించిన దాతలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ కట్లెకుంట దయానంద్ గారు, హైదరాబాద్. | రూ॥ | 1116/- |
| 2. | శ్రీమతి& శ్రీ ఎఫ్. సావిత్రీ రాఘవాచారి దంపతులు,శ్రీరంగాపురం. | రూ॥ | 1116/- |
| 3. | శ్రీ కె. రవీందర్ రెడ్డి గారు, Contractor, కొత్తపల్లి, రేంగొండ మం॥ | రూ॥ | 1116/- |
| 4. | శ్రీ ఎ. పాపయ్య గారు, Contractor, పత్తిపాక, శాయన్‌పేట్ మం॥. | రూ॥ | 1116/- |
| 5. | అల్లం మొగిలయ్య గారు, Contractor, మందారిపేట్, శాయన్‌పేట్ మం॥ | రూ॥ | 1116/- |
| 6. | శ్రీమతి& శ్రీ యం. విజయశ్రీ నరసింహచారి దంపతులు, హైద్రాబాద్ | రూ॥ | 1001/- |
| 7. | శ్రీమతి& శ్రీ కె.శారదా చెన్నాచారి దంపతులు, సికింద్రాబాద్. | రూ॥ | 1001/- |
| 8. | శ్రీమతి& శ్రీ సి.హెచ్. రామశ్రీ నాగభూషణాచారి దంపతులు, నల్గొండ | రూ॥ | 1001/- |
| 9. | శ్రీమతి& శ్రీ వి. శుభశ్రీ గోవర్ధన్ దపంతులు, ఖమ్మం. | రూ॥ | 1001/- |
| 10. | శ్రీమతి డి. నాగమణి గారు, Jt.Director, Economics & Statistics , హైదరాబాద్. | రూ॥ | 1000/- |
| 11. | శ్రీ. కె. సదానందం గారు, Dy. Exc. Engineer | రూ॥ | 1000/- |
| 12. | శ్రీ డా॥ పి. దుర్గచారి గారు, నల్గొండ. | రూ॥ | 502/- |
| 13. | శ్రీ ఎల్. సారయ్య గారు, Contractor, రాయపల్లి, రేగొండ మం॥ | రూ॥ | 500/- |
| 14. | శ్రీ కె. వెంకటరమణా రెడ్డి గారు, Asst. Exc. Engineer | రూ॥ | 500/- |
| 15. | శ్రీ రాజేశ్వర్ రావు గారు, బోర్‌వెల్ కాంట్రాక్టర్ | రూ॥ | 220/- |
| 16. | శ్రీ సి.హెచ్. కుమారస్వామి గారు, సర్పంచ్, సుల్తాన్ పూర్, రేగొండ మం॥ | రూ॥ | 216/ |
| 17. | శ్రీ వి. ఉపేందర్ గారు, M.P.D.O. రేగొండ మం॥ | రూ॥ | 116/- |
| 18. | శ్రీ రాజయ్య గారు, సర్పంచ్, జూబ్లినగర్, | రూ॥ | 116/- |
| 19. | శ్రీ ఆర్.వి. స్వామి గారు, Dy. E.E. | రూ॥ | 100/- |
| 20. | శ్రీ ఎ. నారయణరావు గారు, D.A.O. | రూ॥ | 100/- |
| 21. | శ్రీ ప్రభాకర్ గారు, Contractor, జూబ్లినగర్, | రూ॥ | 100/- |
| 22. | శ్రీ విజయపాల్ రెడ్డి గారు, LDC | రూ॥ | 100/- |
| 23. | చి॥ శ్రీ యం. రాఘవ B.Tech (కీ॥శే॥ నాయనమ్మ, తాతయ్య గార్ల జ్ఞాపకార్థం) | రూ॥ | 5000/- |

శ్రీరస్తు! శుభమస్తు! కళ్యాణమస్తు!

# జనప్రియ రామాయణం

సాహిత్య బ్రహ్మ డా.వి.వి. యల్. నరసింహారావు

ఇది రసప్రియ రామాయణం

అంటే రసప్రియ బిరుదాంచితుడైన శ్రీఫోతేదార్ కేశవాచార్య విరచితమైన రామాయాణ మని మాత్రమే అర్థంకాదు.

రసప్రియులైన సర్వరసజ్ఞుల కోసం ఉద్దేశించిన రామాయణ మని కూడా అర్థాంతరం.

ఈరామాయణంలోని బాలకాండ ప్రమాది శ్రీరామనవమికి 1990లో ముద్రితమై విడుదలైంది. ఇప్పుడు అయోధ్యాకాండ విడుదల కానుంది

స్థూలంగా బాలకాండ రాముదుల జననంతో ప్రారంభమైతే అయోధ్యాకాండ పాదుకా పట్టాభిషేకంతో ముగుస్తుంది

దుఃఖితుడైన భరతుడికి రామచంద్రుడు వైరాగ్యయోగం భోధిస్తాడు. ఈఘట్టానికి ఈగేయంరామాయణకర్త 'రాముని గీతోపదేశం' అని నామకరణం చేశారు.

శ్రీ కేశవాచార్యుల అంతరంగం ఇక్కడ అవగతమౌతుంది అంతేకాదు వీరు ఈకాండకు సంతరించిన పీఠికలో తత్త్వవిచారణ అనే శీర్షికతో రామాయణ తత్త్వ విశేషాలను విపులంగా వివరించారు.

వాల్మీకులవారు కావ్యరూపంలో ధ్వని విశేషంగా అందించిన నిగూఢార్థాలను కేశవాచార్యుల వారు వాచ్యంగా మహాజనానికి నివేదించారు.

రసప్రియరామాయణం విద్వాంసులకు మాత్రమే ఉద్దేశించబడింది కాదు. సర్వజనానికీ అందుబాటులో ఉండాలని రచించబడింది. ఆకారణం వల్లనే దీన్ని గేయ రామాయణంగా పాడు కోవటానికీ చదువుకోవటానికీ వీలుగా రచించారు ఆచార్యులవారు.

పాఠ్యే గేయచ మధురమ్మని వాల్మీకి రామాయణాన్ని ఎట్లా గౌరవిస్తామో రసప్రియ రామాయణాన్ని కూడా అట్లా అమితాదరణతో పఠిస్తాం, పాడుకుంటాం.

ధర్మస్వరూపుడు ప్రేమస్వరూపుడు అయిన రాముడు భరతుడికి చేసినగీతోప దేశంలో ముత్యంవంటి మాట లెన్నో చెప్పాడు.

అందులో :- "ప్రవాహమ్ముపలె వయస్సు, పరుగెత్తును తిరుగులేక

కాన ధర్మమాచరించి, కాంచవలయు పరసౌఖ్యము" అనేది పరమార్థం

ఈపరమార్థం పఠితృలోకానికి అవలీలగా అందిస్తారు కేశవాచార్యులవారు.

మహాకావ్యానికి ఇంతకంటే పరమార్థం ఏముంటుంది? బహుగ్రంథరచయితలైన శ్రీకేశవాచార్యులవారు ఈగేయ రామాయణంవల్ల రసప్రియులైన సర్వజనులకు పరమాప్తులు కాగలరు.

తథాస్తు !

11-04-2000 వి.వి.యల్ నరసింహారావు

# రసమయి

డా.కె. కోదండరామాచార్యులు M.A. (సంస్కృతము)
MOL ., M.A., P.hd., తెలుగు
ఆంధ్రోపన్యాసకుడు, ఖమ్మం.

పుస్తకాలను వ్రాసేవారిని మూడు విధాలుగా పేర్కొనవచ్చును, తమ సంతృప్తి కొరకు వ్రాసేవారు, పండితులకొరకు రచించేవారు సామాన్య పాఠకుల కొర్కై వ్రాసేవారు- ఇలా మూడు విధాలు. "రసప్రియ" గారు తమ సంతృప్తి కొరకు వ్రాస్తూనే సామాన్య పాఠకులకు విశేషజ్ఞానాన్ని అందించాలనే తపనకలవారు. ఆదృష్టితోనే ఇంతకుముందు పర్ణశాల, సీతాన్వేషణ, సుందరకాండ, బాలకాండ అనే పేర్లతో రామాయణంలోని నాలుగుకాండల విషయాన్ని వివరించారు. ఇది అయోధ్యాకాండ.

రసప్రియ గారు పద్యం-వచనం రెంటి జోలికి వెళ్ళకుండ గేయఫణితిలో మాత్రాఛందస్సులో కావ్యాన్ని వ్రాసారు. వీరు చక్కగా చిత్రములను చిత్రించగలరు. తమకావ్యములోని విశేషాంశములను విపులంగా వివరించగలరు. వివరించినారు కూడ. ఇక వారిరచనాశైలిలోని అంశములనే నాలాంటి వారేమైనా చెప్పుటకు అవకాశము కలదు. కాన వానినే చెప్పుటకు ప్రయత్నింతును.

తన మనసులోని ఆవేదనను, ఆలోచనలను తెలియచెప్పుట దానితో కొంత సంతృప్తిని పొందుట కవిపద్ధతి. కేశవాచారి గారు కూడ ఈకోవలోనివారే. శ్రీనాయని సుబ్బారావు గారికి వలెనే వీరికిగూడ పుత్రవియోగము కలిగింది. ఆ విషయాన్ని దశరథుని మనోవేదనలోనే వ్యక్తం చేసారు.

కొడుకులందు జ్యేష్ఠునిపై

కూరిమిమెండట తండ్రికి......

తిరిగిరాని లోకాలకు

అరిగిన జ్యేష్ఠుని కొర్కై

ఎంతేడ్చిన రసప్రియా

ఎట్లుతిరిగివచ్చునయా .... ఇలాంటి ఆవేదనలే కాక

ఈ కవి ఆలోచనలు ఉపదేశాత్మకములై యున్నవి- మచ్చునకు కొన్ని

"తప్పుడు మాటలు నిజమును కప్పిపుచ్చి కాటేయును

చెప్పుడుమాటలు విషమును, చప్పున పై కెక్కించును

కాటుతిన్నవాడొక్కడె కాటికేగు, నీచాధము

మాటవిన్నవారందరు ఘాటుహింస కెరయగుదురు."

"ఒక్కరోజు కధికారము చిక్కెనేని-అధినేతను

చిక్కులు కల్పించి మాయ చేసి క్రింద పడద్రోతురు."

ఇలా సామాన్య విషయాలే కాక కొన్నిఅంశాలను తీసుకొని తత్వాన్ని కూడ వివరించారు.

"నీవుముందునడువవలయు, నీవెనుకనుసీతనడుచు

మీ యిరువుర రక్షించుచు మీవెనుకను నేను నడతు" -ఇది

లక్ష్మణునితో శ్రీరాముడన్నమాట - వాల్మీకి శ్లోకమునకు సరియైన అనువాదమైనా దీనినింతటితో వదలక-

లక్ష్మణుడు జీవాత్మ - సీత దేహము- శ్రీరాముడు పరమాత్మ అని పరమాత్మ ఆజ్ఞననుసరించి జీవుడుముందు వెళ్లి దేహము తనను అనుసరించునట్లు చేసుకున్నచో పరమాత్మ రక్షణ. అనుగ్రహము కలుగునని వివరించినారు.- దేహమునే జీవుడు అనుసరించిన నష్టమువాటిల్లును - అకారవాచ్యుడు శ్రీరాముడు - ఉకారవాచ్య సీతాదేవి - మకారవాచ్యుడు లక్ష్మణుడు - ఈ ముగ్గుర్నిచూస్తే ప్రణవము - ఓంకారము గుర్తుకు వస్తున్నదని విశిష్టాద్వైతతత్వమును చక్కగా వివరించినారు.

శ్రీ ఫాతదార్ కేశవాచారి గారు వయసుమళ్ళినా శరీరధర్మములకు ఆటంకము కల్గుచున్నా - కవితారచనయందు పట్టు సడలనీక నిత్యయవ్వనులగుచున్నారు. అది ఆ భద్రాద్రి రామచంద్రుడు వారకిచ్చిన వరము - అందుకే ఈ అయోధ్యాకాండను కూడ భద్రాచలరామునకే అంకితమిచ్చారు. శ్రీ సీతారామచంద్రస్వామి వారు రసప్రియులైన కవిగారి కలమునుండి జాలువారిన పంక్తులకు రసమయ లక్షణము నాపాదిస్తారని కవిగారికి ఆయురారోగ్యములను అందిస్తారని ఆశిస్తున్నాను.

నా అభిప్రాయమును తెలియపరచుటకు అవకాశమిచ్చిన రసప్రియ గారికి కృతజ్ఞతాభివందనములు ...

9-3-2000

కె.కె. రామాచార్య, ఖమ్మం.

యతోధర్మస్తతోజయః "సుచంద్ర"

# శుభాభినందన

యస్. చంద్రశేఖరశాస్త్రి,
విశ్రాంతోపన్యాసకులు, పంపింగ్ వెల్‌రోడ్డ్, ఖమ్మం.

"కూజన్తమ్ రామరామేతి మధురమ్ మధురాక్షరామ్
ఆరుహ్య కవితాశాఖామ్ వన్దే వాల్మీకికోకిలమ్"

భారతీయ సంస్కృతీ ధర్మాన్ని తరతరాలుగ విశ్వవిఖ్యాతంచేసిన ఆదికవి వాల్మీకి రామాయణపు సారం సర్వథా ప్రాణికోటికి సురభిళరసాలసారం. మానుష రూపం ధరించి అల్పమానుషులతోడ్పాటుతో అమానుషులైన రక్కసులనుక్కడగించిన అతిమానుష స్వరూపుడై, నరజన్మమెత్తిన నారాయణ సన్నిభుడు శ్రీరామచంద్రుని రమణీయ గాథను ఎవరెన్ని విధాల విరచించినా, పునరుక్తిదోషంలేని రసవన్మధురిమలే. అందుకని సకలప్రాణికోటికి ఐ హికాధ్యాత్మిక ఫలశ్రుతులనందిస్తూనే వుంటుంది.

కోటివెలుగుల జ్వాలాతోరణమైన తెలుగు వెలుగులో శ్రీమద్రాయణ కల్పవృక్షాలు కలకాలంగా ఎన్నో ఆవిర్భవించాయి. అవి పద్యంలో హృద్యంగా, గద్యంలో గోక్షీరామృతంలా, గేయంలో పీయూషపేయంగా పుష్కలంగా తెలుగువారి ఎదలోతులు తట్టి కైవల్య ప్రాప్తిని కలిగించాయి.

ఆరసనిర్ఝరశ్రేణిలో ప్రకృతం ఎన్నదగినది రసప్రియ ఫోతేదార్ కేశవచార్యుల వారి రామాయణ గేయకావ్యలహరులు. ఇంతవరకు పర్ణశాల (అరణ్య కాండాంతర్భాగం), సీతాన్వేషణ (కిష్కింధాకాండ), సుందరకాండ, బాలకాండలు వెలవరింపబడ్డాయి ప్రస్తుతం అయోధ్యకాండ, తదుపరి యుద్ధకాండను అచ్చువేసి అలనాటి రామభక్తుడైన గోపనవలె అద్వితీయభక్తి శిఖామణియై, నివాస స్థలమైన ఖమ్మం జిల్లాకేగాక యావదాంధ్రావనికీ తనభక్తి రసప్రియత్వాన్ని చాటి చెప్పుకుంటున్నారు. విద్వత్తు, ప్రతిభాభ్యాసాలు ముప్పిరిగొన్న ఈ భక్తకవిశిరశ్శేఖరునికి శుభాభినందన నానందంగా అందించటం ప్రతి రసయెడందల వక్తవ్య కర్తవ్యం.

రచయిత, పాఠకశ్రేణుల మధ్య పెట్టని గోడలా నిలిచే ఈరసభంగపు అక్షరాభి నందనను "పాఠ్యేగేయేచ మధురమ్" అని ప్రశంసింపబడిన ఆచార్యుల వారి గేయ మధురిమల నొండింటిస్పృశించి సెలవుగైకొంటాను.

చెందొవ విందు మందువలె చిందు రుచింతగ చందనంబు వెచ్చందనమొందు రీతి ద్రాక్షా పాకశైలిలో మాధురీ గణ విన్యాసంతో పండితపామరులకరతలామలక మైన దిగువగేయపు సొంపు గ్రహించండి.

"పున్నమికి సముద్రంబుప్పొంగి పొరలిపోనదేల
కడలెత్తిన జలధిలోన కల్లోలము కలుగనేల"

శ్రీరామ చంద్రుని వ్యక్తిని అల్పాక్షరాలలో అనల్పార్థరచన చేసిన రీతిదిగువగేయంలో అందించారు.

"ప్రజలమధ్య రాముడెపుడు ప్రవర్తిలుచునుండు వారి
బాగోగుల నరసికొనుచు పలుకరించు ప్రేమతోడ".

నాటి రామరాజ్య సార్థకత నేడేది? అట్టినేతలేరీ? శ్రీశ్రీమహాకవి పలికినట్లు, "ఏవితల్లీ! నిరుడు కురిసిన హిమ సమూహములు"? అని ఆవేదనతో ఆలపించాలి.

విద్వత్కవియైన ఆచార్యులవారి మంగళాశాసనము నిచటనుటంకించి, మరొకసారి సుహృన్మిత్రులైన ఆచార్యులవారికి అశేష ఆయురారోగ్య సౌభాగ్య తతినాకాంక్షిస్తాను. అస్తు.

"శ్రీ మన్నమంగళనామా, ప్రేమామృత జలధిసోమ! శ్రితకల్పద్రుమా
రామా! శ్రీభద్రాచల, ధామా! ఈకృతినిగొనుము దశరథరామా!

ఖమ్మం. "జయన్తితే సుకృతినో రససిద్ధా కవీశ్వరాః"
ది. 22-11-2000

# పీఠిక

—— రసప్రియ

శ్రీమద్రామాయణంలో అయోధ్యాకాండమును వాల్మీకి మహర్షి నూట పందొమ్మిది సర్గలలో విస్తరించి వ్రాశాడు. తక్కిన కాండలలోవలె యుద్ధాలు లేకుండ ఇతివృత్తంతో సాగిపోతూ ముందుకాండల కీకాండలోనికథ మకుటాయమానమై నడిచింది. రామాయణకథకుధ్యేయం రావణవధ. రావణవధకు బీజరూపం అయోధ్యా కాండలోని కథ.

**తత్త్వవిచారణ**

అయోధ్య అంటే గెలువడానికి శక్యంకానిది అనిఅర్థం. 'కామాది శత్రువులచే జయింపబడని మానవజన్మ అయోధ్యఅనీ, నీలోని రాముడు నరుడైనాడో, నారాయణుడైనాడో, చూచుకో-రాముని నీ అయోధ్యలో నిలిపావా? అరణ్యాలపాలు చేశావా? ఏనాటికైనా రామునికి నీ అయోధ్యలో పట్టాభిషేకం చేస్తావా' అని ప్రశ్నిస్తుంది. "రామాయణతత్త్వం సాధకుని వ్యవస్థ. శ్రీకృష్ణానందమఠం."

తత్వపరంగా అయోధ్యకు శరీరం అని అర్థం చెపుతూ అయోధ్యలో (అంటే శరీరంలో) జరిగే విషయాలగూర్చి చేప్పేదే అయోధ్యాకాండ అని, శరీరం జనన మరణ పరిభ్రమణం కలది. ఈ జనన మరణాలతో యుద్ధంచేయటం అసాధ్యం కనుక శరీరానికి అయోధ్య అని పేరు అని ధృవపరుస్తోంది. " అంతరార్థ రామాయణం". ఇంకనూ ఈకాండలో తత్వపరంగా కైక కోరిన మొదటి వరమును గూర్చి

శ్లో॥ నవపంచచవర్షాణి దండకారణ్యమాశ్రితః!

చీరాజిన జటాధారీ రామోభవతు తాపసః! అయో 11 వ.స. 26 శ్లో

పద్నాలుగు సంవత్సరాలు దండకారణ్యంలో రాముడు నారబట్టలతో కృష్ణాజినంతో జటాధారియై తపస్సుచేసే వాడుగా ఉండాలి. ఇది కైక కోరిన మొదటివరం. దీని అంతరార్థం ఇట్లున్నది. రాముణ్ని కేవలం తొలగించుకొనుటకు మాత్రమే అయితే పద్నాలుగు సంవత్సరాలు మాత్రమే గడువు ఎందుకు పెట్టింది. దండకారణ్యంలోనే ఉండాలన్న నియమం దేనికి? జటాదారియై తపస్సు చేయాలనడం దేనికి? తపస్సు చేయాలనడంలో కైక రామునికేదో ఘనత కలిగించే స్థితిని కాంక్షిస్తుందనక తప్పదు. దండక ( అరణ్యం) అంటే శిక్షణను చేకూర్చే ప్రశమనస్థితి, నవపంచచ = పద్నాలుగు. వర్షాణి=స్రవింపజేయువాటిని గూర్చి, అనగా దశేంద్రియములు+అంతఃకరణ చతుష్టయము అను పదునాలిగింటిని సాధకుడు శిక్షణముతో ప్రశమనస్థితిని కలిగించి తపస్సు చేయాలి అని ప్రస్ఫుటమౌతున్నది. ఇది 14 ఇంద్రియాలలోను ప్రశాంతస్థితి సాధించే సాధనా రహస్యం. "అంతరార్థ రామాయణం".

తత్త్వదృష్టి యెట్లున్నను రావణవధ కీ కాండలోనే బీజమేర్పడినదనక తప్పదు.

**రాముడు దేవుడా?**

రాముడు దేవుడని వాల్మీకి వాచ్యంగా చెప్పలేదను ఒకవాదం లేకపోలేదు. అది సరికాదనుటకు రాముడు మహావిష్ణువే అని వాల్మీకి ఈశ్లోకమున స్పష్టపరిచినాడు.

శ్లో॥ సహిదేవైరు దీర్ణస్య రావణస్య వధార్థిభిః!
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుస్సనాతనః! (అయో.1వస. 7 వ శ్లో)

శాశ్వతుడగు విష్ణుదేవుడు వరబలమున గర్వించియున్న రావణునివధకై దేవతలు ప్రార్థించగా మనుష్యలోకమున రాముడుగా జన్మించెనని స్పష్టముగా చెప్పిన శ్లోకమిది. రాముడు దేవుడని వాల్మీకి వాచ్యముగా చెప్పలేదను వారికి ప్రమాణ శ్లోకమిది.

**పాలకుని అర్హత లేమిటి?**

'నావిష్ణుః పృథివీపతిః' విష్ణుఅంశ కలిగియే పృథివీపతియగునని భారతీయ సిద్ధాంతం. రాజ్యాభిషిక్తుడగు వానికెట్టి అర్హతలుండవలెనో ఈకాండమందు వర్ణింపబడింది. శ్రీమహావిష్ణువు నందున్న గుణసముదాయము భూమిని పరిపాలించు పాలకునకుండవలెనని తెలుపుటకే వాల్మీకి మహర్షి ఈఘట్టమున రాముని గుణముల వర్ణించినాడు పరోక్షమున పరిపాలకునకుండదగు గుణసముదాయమును వర్ణించి వాని అర్హతలను ధ్వనింపజేసినాడు మహర్షి. నేటి ప్రజాస్వామ్యమున పాలకుల కీఘట్టము ఆదర్శప్రాయముకదా!

**నాడూ ప్రజాస్వామ్యమున్నదా?**

నాటి పాలకుడు నిరంకుశుడు కాడనుటకు, ప్రజామోదముద్ర పడనిదే రాజ్యాభిషిక్తుడు కాలేడనుటకు నిదర్శనంగా దశరథుడు రామపట్టాభిషేక ప్రతిపాదనను ప్రజాపరిషత్ సభకు నివేదంచినాడు. రాముడు జ్యేష్ఠుడే కాక గుణశ్రేష్ఠుడగుట చేతనే దశరథుడు రామునియువరాజ్య పట్టాభిషేకమును ప్రతిపాదించడం, పరిషత్‌సభ దానిని ఆమోదించడం జరిగింది. పౌరజానపద సామంతాదులు మంత్రిపురోహితాది ముఖ్యులు దశరథుని ప్రతిపాదనకు స్పందించి, రామునిగుణ విశేషములనెరిగిన వారగుటచే హర్షాతిరేకమున తమ ఆమోదమును తెలిపినారనుటలో నాటి చైతన్యము ద్యోతక మగుచున్నది.

శ్లో॥ నానా నగరవాస్తవ్యాన్ న్పృథగ్జానపదానపి
సమానినాయమేదిన్యాః ప్రథానాన్పృథివీపతీన్ (అయో. ప్ర.స 45 శ్లో)

**నూరవ సర్గలోని ముఖ్యాంశాలు :**

చిత్రకూటంలో కలిసినప్పుడు భరతునిపై రాముడు ఎన్నో ప్రశ్నలు కురిపిస్తాడు ఆప్రశ్నలలోనే పరిశుద్ధ పరిపాలనకై ఎన్నో మెళకువలు, ధర్మసూక్ష్మాలు సూచిస్తాడు. అవి నాటి భరతునికే కాదు నేటికీ నానాటికీ పరిపాలకులకు మార్గదర్శక సూత్రాలు అవిలోక కళ్యాణార్థమునకు మహర్షి చేసిన దివ్య భవ్యధర్మసూత్రాలు- ఈసర్గను కచిత్సర్గ అని అంటారు. వాటిలోనుండి కొన్ని-ఇవిరాజదోషములు

భరతుడెంత ప్రార్థించిననూ యెందరెన్ని విధముల వాదించినను తుదకు కులగురువగు వసిష్ఠులవారు ప్రభోధించినను పితృవాక్య పరిపాలనను వదలక సాగిస్తాడు సత్యధర్మ పరాక్రాముడైన రాముడు. చిత్రకూటమందు నివసించునప్పుడు రాముడంటాడు నావనవాస దీక్షలో రెండు మంచి పనులు చేసినవాణ్నవుతాను ఒకటి తండ్రిమాటనిలబెట్టుట, రెండవది తమ్ముడు భరతునకు హితముగూర్చుట అని- ఏమిపితృభక్తి ఏమిభ్రాతృవత్సలత ఏమిధర్మనిరతి!

సీతారాముల రక్షణకై వారిసేవకై అంకిత భక్తితో ప్రేమానురక్తితో తన సర్వమును త్యాగముచేసి వారివెంటవచ్చి కడగండ్లను పంచుకొన్నలక్ష్మణస్వామి భ్రాతృభక్తి సేవాతత్పరత నాన్యతో దర్శనీయముకదా!

కడగండ్లలో వీడక పతివెంట అడవులకే నడచి వచ్చిన సీతాదేవి పాతివ్రత్యమును అనసూయాదేవి అంతటి మహాసాధ్వి మహాతపస్విని ఎంతగానో ప్రశంసించిన దీకాండలోననే కదా! స్త్రీజాతి సంస్కృతికి ఆదర్శ భూతమైన సీతామహాసాధ్వి సకల ప్రపంచనారీలోకానికే గర్వకారణం. అందుకే వాల్మీకి మహర్షి 'సీతాయాచ్చరితం మహత్' అన్నాడు.

**కామాదులనర్థదాయకములు**

కామవివశమున కైకేయి కపట మాయాజాలములో జిక్కికొని దశరథుడు రాముని అడవులకు పంపి, రామవియోగ దుఃఖమున తపించి మరణిస్తాడు. రాజ్యకాంక్షచే అధికారవ్యామోహంతో ఇంతదారుణమైన పనిచేసిన కైకేయికి వైధవ్యకళంకములు ప్రాప్తిస్తాయి. కామమోహాలెంత అనర్థదాయకములో ఈకాండమున తెలిపినాడు మహర్షి.

**అంతావిధివశము :**

మరొక ముఖ్యాంశము ఈకాండంలో గమనించదగినది ఏమన, రాముని యువరాజ్య పట్టాభిషేకం తప్పిపోవుటంలో దైవహస్తముంది అనువాస్తవం. మానవుడు ఊహిస్తాడు దేవుడు నిర్ణయిస్తాడు. "తలచుకున్నదెల్ల తథ్యమైన యెడల దైవమున్న దనుచు తలతురెవరు?" తెల్లవారితే పట్టాభిషేకం-ముహూర్త నిర్ణయమైంది. రాత్రికి రాత్రి మంధర దుర్బోధకు లోనై కైకేయి పన్నాగం ఫలించి పట్టాభిషేకం భగ్నమైంది. ఇందుకు కారణం దైవనిర్ణయం కాకమరొకటి కానేకాదనక తప్పదు. మొదట రామపట్టాభిషేకవార్తవిన్న కైకేయి హర్షపులకిత అయింది. కాని మరుక్షణమే మంధర దోర్బోధకు మారిపోయింది. దశరథుని మాయాజాలములో పడవేసింది. తనకుత్సితవరములు చెల్లించుకొన్నది రావణవధకోసం రామపట్టాభిషేకం తప్పిపోవాలి. పట్టాభిషేకంకన్న లోకాంతకుని వధ ముఖ్యం. ఏమిజరిగినా మనమంచికే అని దైవనిర్ణయం యెట్లుంటేఅట్లు జరుగుతుంది. అని ఈఘట్టంవల్ల తెలుస్తుంది.

**కల్యాణ కథ :**

అన్నిటికన్న విశేషించి చెప్పుకోదగిన ముచ్చటైన అంశమొకటుంది. అది సీతమ్మ తనపెండ్లి కథతానే స్వయంగా అనసూయాదేవితో చెప్పుట. శుభం అంటూ ఈ ముచ్చటతో ముగుస్తుంది ఈ అయోధ్యాకాండ. కళ్యాణప్రాప్తికి కన్యలు ఈకథనుచదివి అభీష్టసిద్ధి పొందెదరుగాక! తథాస్తు!

**నివేదన :** ఇంత వరకు నాగేయ రామాయణ సంపుటాలునాలుగు వెలువరించ బడ్డవి. పర్ణశాల (అరణ్యకాండ అంతర్భాగం) సీతాన్వేషణ (కిష్కింధాకాండ) సుందరకాండ, బాలకాండ, ఇక ప్రస్తుత అయోధ్యాకాండ - తరువాతయుద్ధకాండ ముద్రణకు దాతలకై ఎదురుచూస్తున్నది.

వాల్మీకి రామాయణం చదువుతుంటే ఏదీవదలిపెట్టలేక పోయాను. అంతావ్రాయలనిపించేది. అందుచేత నారామాయాణ గేయసంపుటాలు విస్తృతమైనవి. అయినా గాయక పాఠకుల సౌలభ్యంకోసం ప్రతికాండను ఒక గంటలో పాడుకొనడానికి వీలుగా సంక్షిప్తపరిచాను. కుదింపులో అంశములు పోకుండా అవసరమైన చోట అనుసంధాన చరణాలు క్రొత్తగా వ్రాసిపొందుపరిచాను. ఈ సంక్షిప్తకాండలు త్వరలో అచ్చుకానున్నవి. గాయకులెవరైన నన్నుసంప్రదించి నా ఆమోదంతో కచేరీలు చేయవచ్చును, క్యాసెట్లు చేయవచ్చును.

ఇప్పటికి పర్ణశాల, సుందరకాండ క్యాసెట్లు తయారైనవి. పర్ణశాల క్యాసెటు అన్ని దేవస్థానాలలో కొనుగోలు చేయుటకు కమీషనర్ దేవదాయ ధర్మదాయశాఖ హైద్రబాద్ వారి ఆర్డర్సు జారీఅయినవి. నెం.ఎల్.డిస్.నెం. : తె 3/56412/88 తేది : 15-12-1988.

గేయం శ్రవణపపేయ మని వాల్మీకానికి స్వేచ్ఛాను సరణంగా మాత్రా చందస్సులో యతి నియతితో సరళశైలిలో విసుగు రాకుండుటకు అక్కడక్కడ గతులు మారుస్తూ కొన్ని చోట్ల అంత్యాను ప్రాసనియమం పాటిస్తూ వ్రాశాను. శ్రుతిసౌఖ్యం కోసం కొన్నిచోట్ల యడాగమ నుగాగమాలు పాటించలేదు. పండిత పామరుల నలరింప జేయగలదను ఆశాభావంతో నేనీ ప్రయత్నంచేశాను. నాయీ ప్రయత్నమే మాత్రం ఫలించినా కృతార్థుడ నైనట్లు భావిస్తాను.

సర్వేజనా స్సుఖినో భవంతు!

— రసప్రియ



# సౌభ్రాత్రానికి స్మృత్యంజలి

సవతుల కొడుకులకెంతటి
సౌభ్రాతత పరస్పరము
గంగాయమునల కైవడి
సంగమించినారు నాడు.

ఏకోదుకులైన నేమి
ఇంతసందు దొరికెనేని
పొట్టమీద వెన్నుమీద
పొడువ సిగ్గుపడరు నేడు.

భ్రాతృవత్సలత నాపై
ప్రవర్షించి నామనుగడ
కలరినట్టి పుణ్యజీవు
లమరులు నా అన్నయ్యలు

స్వర్ణశిల్పకళామయుడు
పద్మనాభ పెద్దన్నకు
ప్రతిభాకౌశలపండిత
వర దామోదర భ్రాతకు
పద్యములను హృద్యముగా
చదువు జనార్దనాభ్రాతకు

అమృతమూర్తు లీముగ్వురు
అన్నల సౌభ్రాత్రానికి
చిరస్మృతగ 'రామకృతిని'
స్మృత్యంజలి ఘటియింతును.

# అన్వేషణక్రమము

| ఆశ్వాసము 1-25 సర్గలు | విషయం | పేజీలు |
|---|---|---|
| ప్రథమాశ్వాసము : | భరతుడు మాతుల గృహమేగుట, రాముని యువరాజ్య పట్టాభిషేకమునకు సభామోదం. దశరథుడు రాజనీతి బోధించుట దశరథుని సంశయాతురత పట్టాభిషేక సంబ్రమము. మంథర దుర్బోధ, దుర్బోధకులోనైన కైకేయి, కామపరవశుడైన దశరథుడు వరాలశరాలు దశరథుడు కైకను దూషించుట. విధివిలాసం కౌసల్య లక్ష్మణుడు మంగళాశాసనం. | 1 |
| ద్వితీయాశ్వాసము : | రాముడు సీతకు వనవాసవార్త చెప్పుట సీతారామ సంవాదము, రాముని అంగీకారం, లక్ష్మణుని ప్రార్థన - త్రిజటుడు - తండ్రితో వీడ్కోలు. సుమంత్రుడు. సిద్ధార్థుడు. వసిష్టుడు. అయోధ్యకు వీడ్కోలు. తమసానదీతీరం. | 27 |
| తృతీయాశ్వాసము : | గంగానది, గుహుడు, సుమంత్రుని పరితాపం. సీతగంగకు మొక్కుకొనుట, రక్షణకర్తవ్యం. హెచ్చరిక. రాముడు తలిదండ్రుల తలచుకొని దుఃఖించుట. లక్ష్మణుని ఓదార్పు. భరద్వాజాశ్రమము. చిత్రకూటము. వాల్మీకి ముని దర్శనం. పర్ణశాలనిర్మాణం. వాస్తుశాంతి. | 45 |
| చతుర్థాశ్వాసము : | సుమంత్రుని తిరిగిరాక. దశరథుడు సీతారామలక్ష్మణుల వృత్తాంత మడుగుట. సుమంత్రుడు చెప్పుట. కౌసల్య నిష్ఠురోక్తులు. దశరథుని పశ్చాత్తాపము. అరాచకత్వ అలజడి. భరతుని పిలిపించుట. భరతుని దూషణ. కౌసల్యతో ప్రమాణాలు చేయుట. ఉత్తర క్రియలు. రాముని దోడ్కొని వచ్చుటకు భరతుని ప్రయాణం. | 61 |
| పంచమాశ్వాసము : | భరతుడు గుహునిచూచుట. భరద్వాజాశ్రమము చేరుట. అద్భుత విందు. భరతుడు చిత్రకూటమేగుట. చిత్రకూట వినోదాలు. మందాకినీ విహారాలు. భరతుని ఆగమనం. భరతరామ సమాగమం. భరతుని అభ్యర్థన. రాముని సమాధానం. రాముని గీతోపదేశం. జాబాలినాస్తికవాదం. రామునిఖండన పాదుకాపట్టాభిషేకం. అత్రిమహర్షి ఆశ్రమము. సీతాకళ్యాణ కథ. ఫలశ్రుతి. మంగళగీతి. | 89 |

ఈ రాజ్యపాలనను నేను అంగీక
రించను. మీరు తిరిగి రాకుంటే
మీ పేర రాజ్యాన్ని పాలిస్తాను. మీ
పాదుకలే మీకు బదులుగా ఉంటాయి

*చైతన్యంబునులేని పాదుకలహో! సామ్రాజ్యపట్టంబుతో*
*పూతోద్దీపికలయ్యె నీపదయుగంబున్ దాకుటంజేసి నే*
*చైతన్యుండ త్వదంఘ్రులంటె దిక యే సద్యోగముల్ గూర్చెదో*
*ధాత్రీజాహృదయేశ! భద్రగిరి సీతారామచంద్ర ప్రభూ!*

**నా భద్రగిరి శతకమునుండి.**

**— రసప్రియ**

# ప్రథమాశ్వాసము

## ప్రార్థన

శ్రీగౌరీ ప్రియపుత్రుని
శ్రీపదముల నెద భజించి
శ్రీవాగ్దేవీ చరణ
శ్రీయుగళిని మది దలంచి

అయోధ్యాకాండముతెనుగు
గేయకావ్యముగ రచింతు
భద్రాచలరాముని పద
పద్మాలకు సమర్పింతు

**భరతుడుమాతామహునింటికేగుట**

భరతుడు శత్రుఘ్నుగూడి
పయనమ్మె మాతామహు
గృహమ్మేగి అచ్చోటను
బహుసుఖముగ గడుపుచుండె

దశరథరాజేంద్రుడు వా
ర్ధక్యభారమునను రాజ్య
భరమునుండి విశ్రాంతిని
బడయనెంచి ఒక్కనాడు

సచివ పురోహిత నానా
జానపదులతో పట్టణ
ముఖ్యులతో పెక్కురాజ
ముఖ్యులతో సభచేసెను

**సభామోదం**

మహాజనములారా! సా
మ్రాజ్య భారమింత వరకు
మోసిమోసి అలసిపోతి
ముదిమిచేత క్రుంగిపోతి

ఆకసాన భూమిపైన
నాకు కొన్ని ఉత్పాతము
లగుపడుచున్నవి నామన
సాందోళన పడుచున్నది

వెనువెంటనె ఈరాజ్యము
వేరొకనికి అప్పగించి
విశ్రాంతిని తీసికొందు
వినవలె నావిన్నపంబు

నా మొదటి కుమారుడు శ్రీ
రాముడు జగదభిరాముడు
అతుల పరాక్రమ వంతుడు
అఖిలజ్ఞుడు ధర్మజ్ఞుడు

రాముడు జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు
రాజగుటకు తగినవాడు
వానిరాజు జేసినచో
వర్ధిలదా మనరాజ్యము!

అనిదశరథు డన్నంతనె
అవునవునిది బాగున్నది
అనుచు సభాసదులందరు
హర్షము ప్రకటించినారు

మబ్బులగని హర్షంబున
మయూరాలు అరచునట్లు
సభ్యులు హర్షమున సభా
సదన మదర జయపెట్టిరి

అంత దశరథాధీశుడు
ఆనందముతో రాముస
కొనరగ పట్టాభిషేక
మునుగట్టగ పూనుకొనెను

ఇది చైత్రము శ్రీమంతము
ఇపుడే పట్టాభిషేక
మునుజరుపగవలయు విలం
బనము సేయవలదు మనకు

అనుచు సభాసదుల సమ్మ
తినిగొని రాజ్యాభిషేక
మునకు నుచితమగు ప్రబంధ
ములకై ఆదేశించెను

కొలువుకు శ్రీరాముని దో
డ్కొని రమ్మని మంత్రిసుమం
త్రుని అజ్ఞాపించ నతడు
వెనువెంటనె వెళ్లి రామ
విభుని రథముపై దోడ్కొని
విచ్చేసెను రాజసభకు

రాముడు చేమోడ్చితండ్రి
సమీపానికేగి పేరు
చెప్పుకొనుచు నమస్కృతుల
చేసె తండ్రి పాదాలకు

సాష్టాంగ నమస్కారము
సలిపి లేచి తనప్రక్కన
చేతులు కట్టుక నిలిచిన
శ్రీరాముని చేరదీసి

మణిఖచితంబై కాంచన
మయమై శోభిల్లెడు మహి
తోన్నతాసనంబున గూ
ర్చుండజేసి విభుడిట్లనె

రామా! శ్రీరామా! నీ
రాజ్యపాలనముగోరుచు

సకల ప్రజలు నీయువరా
జ్యాభిషేక మహోత్సవము
వేవేగమె జరుపుటకై
వేడుక పడుచున్నారలు

ఇదియే కాకుండ నాకు
వృద్ధత్వము పైబడినది
ఇంకను ఈరాజ్యభార
మేమాత్రము మోయలేను

రాజ్యపాలనా భారము
రామా నీకప్పగింతు
ఇందుకొప్పుకొనవలె నా
కింతకన్న ఏమున్నది

కాన రేపు పుష్యమి న
క్షత్రమందు నేను నిన్ను
యువరాజును చేయబోవు
చున్నాడను నాయనా!

**దశరథుడు రాజనీతి బోధించుట**

నీవు మనస్థైర్యముతో
నీతి నియమ బద్ధుడవై
సర్వజనాభ్యుదయమెంచి
సత్యధర్మమార్గములో
రాజ్యమేలవలయును జన
రంజకముగ శ్రీరామా!

పరుషప్రసంగము, చిల్లర
పనివాండ్రకు చనువిచ్చుట,
కుత్సితుతో సహవాసము
క్రూరదండనము, ఖజాన
గుల్ల పరుచుటిత్యాదులు
కూడదు కూడదు కూడదు

మధువ్యసనమది కూడదు
వధూమోహమది కూడదు
వృథావ్యయము జూదములివి
వ్యధామూలములు కూడదు

పరరాజ్యపు సంగతులను
పరోక్షముగ నరయవలయు
ప్రత్యక్షముగా స్వరాజ్య
పరిస్థితులు చూడవలయు

నీ ఆజ్ఞల నధికారులు
నెరవేర్చుచు నుండవలయు
మంత్రులతో ప్రత్యక్షపు
మంతనాలు సలుపవలయు

సచివులు సైన్యాధిపతులు
సకలజనులు నీవల్లను
నిండుగ సంతోషించుచు
నీవాళ్లై యుండవలయు

అపుడే నీ పరిపాలన
కందరు హర్షించుచుంద్రు
చాపల్యములేక దృఢము
గా పాలన సేయవలయు

రాముడు తనతండ్రి తీర్పు
ప్రజా సభామోదంబును
గౌరవించి పట్టము తా
గట్టి కొనగ సమ్మతించె

రామ కుమారునకు యౌవ
రాజ్యమొసగు వార్తనువిని
అతని సఖులు పరుగెత్తుచు
అత్రమాత్రమున కౌస

ల్యాదేవికి చెప్పినారు
హర్షాంబుధి దేలినారు

తనపుత్రున కభిషేకం
బనుప్రియవార్తను దెలిపిన
రామసఖుల కా పట్టపు
రాణి యొసగె పలుకాన్కలు

రామకుమారుడు దశరథ
రాజేంద్రునకభివాదము
చేసి రథంబెక్కి తిరిగి
స్వీయ గృహంబరుదెంచెను

**దశరథుని సంశయాతురత**

దశరథుడును సభముగించి
తనగృహంబునకు నేగెను
కాని అతని మనసదేల
కలవరమొందుచు నుండెను

కైకేయిని పెండ్లియాడు
కాలమందు ఆమె కొడుకు
నభిషేకించెద రాజుగ
నని దశరథుడామె తండ్రి
అశ్వపతికి మాటిచ్చెను
ఔరా! కామము గ్రుడ్డిది

ఆ సంగతి మదిని మెదిలి
అనుమానము పొడమెను రా
మాభిషేక మవిఘ్నముగ
నగునో కాదో యటంచు

కామలాల సతచే నరు
డేమేమో చేయుచుండు
దానిఫలిత మనుభవించు
తరుణమందు కుందుచుండు

అదియెగాక మునిశాపము
మదిలో మెదలుచునుండెను
తనకు పుత్రశోక మెపుడొ
తప్పదనుచు భీతిల్లెను

అంతియెగాకుండ తనకు
అరిష్టాలు గోచరించు
చుండుటచే అవనీశున
కుల్లము కల్లోలితమయి
సంశయాతురత జెందుచు
సంశోషిల్లుచు నుండెను

మంత్రి సుమంత్రుని రాముని
మరల దోడుకొని రమ్మని
ఆజ్ఞాపించెను దశరథు
డాందోళిత మానసుడై

వెనువెంటనె మంత్రివరుడు
వెళ్లి రామమూర్తిని సా
దరమున దోడ్కొని వచ్చెను
దశరథేశు భవనమునకు

రామచంద్రుడా దశరథ
రాజేంద్రుని పాదములకు
సాష్టాంగ నమస్కృతులను
సలిపి చేరువన నిలిచెను

అంతమహారాజు తనయు
నాప్యాయత కౌగిలించు
కొని ఉన్నతమగు ఆసన
మునగూర్చొనజేసి పలికె

రామా! నాకిపుడెన్నో
అమంగళ స్వప్నములగు

పడుచున్నవి నింగినుండి
పిడుగుల చప్పుళ్లతోడ
కొరవులు మంటలులేకయె
ధర పైబడునట్లగుపడు

నాదుజన్మ నక్షత్రము
నకు సూర్యాంగారక రా
హులువచ్చినవని జ్యోతి
ష్కులు చెప్పుచునున్నారలు

ఇట్టి అమంగళములు గ
న్పట్టినపుడు రేనికి మర
ణము గలుగును లేదా ఘో
రములగు ఆపదలుగలుగు

ఎంతటి విబుధులకైనను
స్వాంతము చాంచల్యమొందు
క్షణముమార గుణము మారు
నను సామెత చెప్పుచుంద్రు

శ్రీరామా! నా మనస్సు
మారకముందే నీకభి
షేకము జరిపించవలయు
సేయతగదు విలంబనము

నేడు పునర్వసు రేపే
నిర్ణిత పుష్యమి వచ్చును
ఆరోజే తావక రా
జ్యాభిషేకమ్మై పోవలె

నీవిక యిప్పటి నుండియె
నియమబద్ధుడవునై ద
ర్భలపైన పరుండియుండి
భార్యతోడ గూడ నీవు

ఉపవాసము రేయంతయు
నుండవలయు శ్రీరామా!

ఘనకార్యములకు ఆటం
కములు మెండుగావున నీ
మిత్రులతో నీవు మిగులు
మెలకువతో నుండవలయు

నీవే జ్యేష్ఠుడవటంచు
నీ తమ్ముడు భరతుడు ని
న్ననుసరించువాడే యిం
దనుమాన మొకింత లేదు

అతడు ధర్మపరాయణుడు
అతడు సంప్రదాయ మెరిగి
నట్టివాడు జితేంద్రియుడు
అనుమానము లేదిందున

అయినను మానవుల చిత్త
మనిత్యమది యన్నివేళ
లందునొకే తీరుండదు
అని నామదికనిపించును

ఖలు కల్పిత మిత్రభేద
ములకులొంగిపోయి ధర్మ
పరాయణుడు గూడ ధర్మ
భంగమునకు పూనవచ్చు

అట్లగుటను రేపే నీ
అభిషేకము జరుపవలెను
అని దశరథ మహారాజు
అనుమతినిచ్చిన పిమ్మట
తండ్రికి వందనమొనర్చి
తన గృహమేగెను రాముడు

**పట్టాభిషేక సంబ్రము**

తదుపరి వెంటనె రాముడు
తల్లిగృహంబునకు నేగి
అమ్మా! రేపే నా రా
జ్యాభిషేకముగునని మా
నాన్నగార లానతిచ్చి
నారు నీవునాకు సీత
కేయేమంగళములు చే
యించవలెనొ అవియన్నియు
మాచే చేయించవలెను
మమ్ముల దీవించవలెను

ఆమాటలు విని కౌస
ల్యాదేవికి కనులనుండి
హర్షబాష్పములు జలజల
వర్షధారలై కురిసెను

రాత్రియంతయును సీతా
రాములు ఉపవాసవ్రతము
సలిపినారు దర్భశయన
ములపై నిద్రించినారు.

రాముడు తెలవారుటకొక
ఝామువ్రొద్దు ఉందనగనె
మేల్కొని తన భవనమునకు
మేల్మి అలంకారములను
చిత్రించుట కారంభము
చేసినాడు ముచ్చటపడి

తదనంతరమాతడు ప్రా
తః కాలపు సంధ్యావం
దన గాయత్రీ జపాదు
లను సమాప్తి చేసినాడు

ప్రతిగృహమ్ము ప్రతివీధియు
పచ్చని తోరణములతో
కలకలలాడుచు ముగ్ధాం
గనవలె ముస్తాబయ్యెను

పాలవంటి తెల్లనైన
పట్టు ఉత్తరీయమ్మును
పైనగప్పుకొని రాముడు
బ్రాహ్మణోత్తములచే పు
ణ్యాహాదుల చెప్పించుట
కారంభము గావించెను

మంగళ వాద్యాలధ్వనులు
మంత్రోచ్చారణ రవళులు
చెలరేగు చయోధ్యా పుర
సీమనెల్ల నినదించెను

పౌరులందరును మేల్కొని
పట్టణమంతయు మరింత
అందముగ నలంకరించ
నారంభము చేసినారు

సూర్యోదయ మవగానే
శుభముగ రామాభిషేక
మహోత్సవము జరుగుననుచు
మహదానందము పొందిరి

తెలవారగ వచ్చెను నలు
దిశల నుండి జనములు గుం
పులు గుంపులుగా వచ్చిరి
పురమిరకటమై పోయెను

హర్షధ్వానాలు మింటి
నంటుచుండనొకరి మాట
ఒకరికి వినిపించక జన
ముక్కిరి బిక్కిరి యయ్యెను.
అనుక్షణము జనప్రవా
హము కోలాహలధ్వనుల
లోన పొంగి పొరలి అయో
ధ్యానగరము చుట్టుముట్ట

పున్నమినాటి సముద్రము
పొంగిపొరలిపోవుచుని
ర్ఘోషణతో దుర్భీకర
ఘోర జలచరాదులతో
కల్లోలంబైన కరణి
కనిపించె నయోధ్యాపురి

పున్నమికి సముద్రంబు
ప్పొంగిపొరలి పోనదేల?
కడలెత్తిన జడధిలోన
కల్లోలము కలుగనేల ?

సంతోష విషాదములవి
సమమైన వనంగనేమొ!
అందుదేనినైనపొందు
నపుడశ్రువులే వచ్చును

**మంథర దుర్బోధ**

అది సంధ్యాసమయ మయో
ధ్యాపట్టణమందు రాజ
మందిర ప్రాసాదము
నందొక స్త్రీ నిలుచున్నది

అది కైకేయీదేవీ
అంతఃపుర హరణదాసి
దానిపేరు మంథర అది
గూనిది పెడబుద్ధిగలది

ఆసాంయం కాలవేళ
యాధృచ్ఛికముగ మంధర
మేడమీదకెక్కి నిలిచి
చూడసాగె నలుదిక్కుల

జనసమూహ మానందో
త్సాహముతో నలరుచుండె
జంతు జాలమును సంతో
షమును వెల్లడించుచుండె

జనులు రాజవీధులందు
సంబరానమూగుచు ము
చ్చట్లాడుచు పండుగ రో
జట్లలరుచుకనిపించిరి

పట్టణ వీధులు పరిశు
భ్రముగ నూడ్చి నీళ్ళుచల్లి
కనువిందుగ పచ్చనితో
రణములు గట్టుచునుండిరి

సుమధురముగ మంగళవా
ద్యములు మ్రోగుచుండెను బ్రా
హ్మణుల వేదఘోషలు ప
ట్టణమంతయు నినదించెను

ఆవేడుక కేమి హేతు
వని మంథర యడిగెనచట
పరమానందమున పొంగి
పరవశించు నొక దాదిని

అంతదాది ఉదయమె రా
మాభిషేకమని చెప్పెను
ఆమాటకు మంథర ని
ర్ఘాంతపోయి చింతించెను

గబాగబా క్రిందికి దిగి
కైకేయీ పడక గదికి
పోయిన దపుడామె నిదుర
పోవుచునుండగ జూచెను

ఉచ్ఛస్వరమున మంథర
ఓరాణీ! మూర్ఖురాల!
లెమ్ముమ్మవేగ ఘోరప్రమా
దమ్ము నీకు రానున్నది

పతికి ప్రియంబై యెంతో
భాగ్యవంతురాలననుచు
విఱ్రవీగుచున్నావే !
వెఱ్రిదాన నీ వెరుగవె?

రేపు తెల్లవారగనే
నీపతి రాముని యువరా
జ్యాభిషక్తుగా జేయును
ఆపద ముంచుక వచ్చెను.

అని మంథర పలికెనంత
అదేమిటే అట్లందువు!
నారాముడు రాజైతే
నాకానందమెకాదా?

రాముడు నన్నెంతో గౌ
రవముగ తనకన్న తల్లి
వలే జూచును వాడన్నను
భరతుడన్న నాకొకటే

రాముడు రాజగునను సం
క్షేమవార్త వినిపించిన
నీకే కానుక నిచ్చిన
నిక్కముగా అదితక్కువె

అనుచు కైక మంథర కొక
ఆభరణమొసంగె నంత
ఆ మంథర దాని నాగ్ర
హాన విసరి పారవేసె

బుద్ధిహీనురాలా నీ
పోకడ వింతగనున్నది
దుఃఖములో సంతోషిం
తువు దుఃఖించుటకు బదులు

నీమంచిని కోరిచెప్ప
నామాటను వినకుంటివి
అయ్యో! నాపిచ్చిరాణి
ఆపదలోపడనుంటివి

రేపుదయమె రాముడు రా
జైపోవును, రాజమాత
కౌసల్యకు మనమంతా
దాసీజనమై పోదుము

భరతుడు రామునకు భృత్యు
పగిదిసేవ జేయవలయు
కౌసల్యకు నీవు నూడి
గము సేయుచునుండవలయు

కౌసల్యకు మేమంతా
దాసీజనమై పోదుము
నీవును భరతుడు వారికి
సేవకులై చరియింతురు

రాముడు బహువర్షంబులు
రాజ్యమేలు ఆపిదపను
రాముని కొడుకులు మాత్రమె
రాజ్యమేలుటకు నర్హులు

మనభరతుడు రాజ్యమేలు
టనుటకల్ల నీవు మహా
రాణివగుట కల్ల సవతి
రాపిడి తప్పదు నీకిక

సవతికొడుకు రాముని రా
జ్యాధిపత్యమున భరతుడు
బానిసవలె హీనముగా
దీనునిగా బ్రతుతుకవలయు

రాముడు రాజైన పిదప
రాజ్యము నిష్కంటకముగ
జేసికొనుటకై భరతుని
క్షేమముగా నుండనీడు

భరత కుమారుని దేశాం
తరమో లోకాంతరమో
తరలించును కేసరికడ
కరికి నుంటక్షేమమగున?

రాముడు రాజగుట మనకు
క్షేమకరముకాదు వాని
వనములకంపించి భరతు
నొనర రాజు జేయవలయు

కాని యెడల దాసివగుచు
కౌసల్యను సేవించుము
భరతుడు రాముని భృత్యుని
వలె సేవించుచునుండును.

మంథర చెప్పిన తప్పుడు
మాటలువిని కైకేయికి
మనసున విసమెక్కిక్రోధ
మున కన్నులు ఎర్రబారె

పడగవిప్పి బుస్సుమనుచు
పైకెగసిన పాముపోలె
పడక మీది నుండి లేచి
పలికెనిట్లు మంథరతో

ఓమంథర! చాలుచాలు
ఉపాయమేదైన చెప్పు
రాముని వనికంపుటెట్లు?
రాజెట్లగు నాభరతుడు?

చెప్పు చెప్పు వేవేగమె
చెప్పు యేయుపాయమైన
హీనముగా బ్రతుకుట కూ
హించుటకైన సహించను

బ్రతికుండగ సవతిసేవ
సుతరాంనేసేయనునా
కన్నడు బానిస యగుటను
కలనైనను ఊహించను

తప్పుడు మాటలు నిజమును
కప్పిపుచ్చి కాటేయును
చెప్పుడుమాటలు విషమును
చప్పున పైకెక్కించును.

కాటుతిన్న వాడొక్కడె
కాటికేగు నీచాధము
మాట విన్న వారందరు
గాటుహింస కెరయగుదురు

ఓమంథర వేవేగమె
ఉపాయమేదైన చెప్పు
రాము నడవికంపుటెట్లు?
రాజెట్లగు నాభరతుడు?

అంత దాసి మంథర యి
ట్లని చెప్పెను కైక తోడ
చెడగొట్టెడి పనులంటే
చెనటి కెన్ని యుపాయాలు!

దేవాసుర యుద్ధములో
దేవేంద్రుని పక్షమూని
అసురులతో నీపెనిమిటి
ఆలమొనర్చెడి వేళను

పోరాటములో నీపతి
వైరిదెబ్బలకు మూర్ఛిలి
తేరును వేరొక చోటికి
తీసుకెళ్లి కాపాడితి

వట్లు రెండుసార్లు భర్త
యసువులు కాపాడినావు
అందులకు వరాలురెండు
అడుగుమనెను నిన్నాతడు

అవసరమున్నపుడు వాటి
నడిగెదనని నీవంటివి
ఈవిషయము నీవే నా
తోవివరించితి వొకపుడు

ఆరెండు వరాలిప్పుడు
కోరుకొనుము నీభర్తను
రాముని బదులుగ భరతుని
రాజొనరించుట మొదటిది

రాముడు పదునాల్గేడుల
రణ్యావాసముండుట రెం
డవ వరమది యెందుకనగ
నవధరింపవే చెప్పెద

రాముడిచట నుండెనేని
రాణించడు నీభరతుడు
దివాకరుని ప్రకాశాన
దీపానికి విలువుండదు

రాముడన్న ప్రజలకెంతొ
ప్రాణము-నీభరతుడన్న
ప్రజలెరూగం రతడెప్పుడు
వసియించును తాతయింట

ప్రజల మధ్యరాముడెపుడు
ప్రవర్తిలుచు నుండు వారి
బాగోగుల నరసి కొనుచు
పలుకరించు ప్రేమతోడ

రామునిపై ప్రజలకు అను
రాగము మెండగుట చేత
వాడే తమ పాలకుడయి
వర్ధిల్లాలని తలతురు

వాడిక్కడనుండెనేని
ప్రక్కలోని బల్లెమట్లు
ప్రమాదకరమై భరతుని
సమాధి గావించగలడు.

రాముడు పదునాల్గేడుల
రణ్యావాసముండినచో
భరతుడట్టి వ్యవధిలోన
ప్రజకు దగ్గరై పోవును

మూలబలము తన యధీన
ముగ నొనర్చు కొనును గాన
రాముడు వచ్చిన నతనికి
రాజ్యము దక్కకనుండును

ఎల్లప్పుడు నీకొడుకే
ఏలికగా నుండగలడు
అధికారము చేజిక్కిన
అంతా తన వశ్యమగును

రాముడడవి పోకుండగ
రాజ్యము వచ్చిన వ్యర్థమె
కాదు, అనర్థము తెచ్చును
కాన వాని వనికంపుము

అడవిలోన బహుకాలము
గడిపి మళ్లి వచ్చెనేని
భరతునిపై భక్తి కలిగి
ప్రజలు వానికెడమౌదురు

ఒక్కరోజు కధికారము
చిక్కెనేని అధినేతను
చిక్కులు కల్పించి మాయ
చేసి క్రింద పడ ద్రోతురు

కుటిల రాజనీతిజ్ఞత
గూనిదాని కెంతున్నది
రాముడేమియైన వాని
రాజ్యము కావాలన్నది

కాలపరిమితిని గోరిన
కారణమొ కటున్నది శా
శ్వత వనవాసమునడిగిన
జనమ్మెదురు తిరుగగలరు

పదియునాల్గు వత్సరాల
వనవాసం బడిగినచో
రాముడు కోన్నాళ్లకైన
రాగలడని సయిరింతురు

శాశ్వత వనవాసమనిన
జనము రెచ్చి ద్వేషింతురు

కుటిలరాజనీతిజ్ఞత
గూనిదాని కెంతున్నది
పన్నాగంబెంత పకడ్
బందీగా నొనర్చినది

అంతేగాకుండగ అది
అలుక మెలకువల నెల్లను
కైకేయికి పనిగట్టుక
కడుచక్కగ నేర్పించెను

**దుర్బోధకు లోనైన కైకేయి**

మంథర మాటలు కైకకు
మనసుకెక్కి పిచ్చెక్కెను
కుటిల కుబ్జతో గూడుకొ
కోపగృహమ్మున కేగెను

బహుప్రియునిగ నటియించుచు
వంచించె నటంచు నెంచి
భర్తమీద కినుక జెంది
పామువోలె బుసగొట్టుచు

ఓమంథర! వినవే నే
నీ మందిరమున చచ్చెద
ఆవార్తను దశరథునకు
నీవు తెలుపుటైన అగును

కాక రాము డడవిని బహు
కాలముండగా భరతుడు
రాజ్యసుఖంబులను పొంది
రంజిల్లుచు నుండనగును

ఈ రెంటిని తప్పక నొక
టేదైనను జరిగి తీరు

అంతవరకు పచ్చినీళ్ల
నైనముట్ట - చావనైన

చచ్చెదనే కాని నేను
శపథము వీడ నటంచును
గూనిదాని ఎదుట కైక
ఘోర ప్రతిజ్ఞను చేసెను

మంగళకరమగు సొమ్ముల
మైనుండి విసర్జించెను
మంగళాంబరాల విడిచి
మలిన వస్త్రములు దాల్చెను

కోపముతో బుసగొట్టుచు
కురులు చెదర గొట్టుకొనెను
వేడివేడి నిట్టూర్పుల
విడుచుచు బొమముడి పెట్టెను

పూలదండలను భూషణ
ములను విసరి పడవేసెను
అలుకబూని ఆడత్రాచు
వలె నేల పరుండి మగని
రాక కెదురు చూచుచుండె
రాక్షసియై కైకేయా

**కామవశుడైన దశరథుడు**

రాముని అభిషేకవార్త
రాణికైకతో స్వయముగ
చెప్పనెంచి దశరథ రా
జేంద్రుడు చనుదెంచినాడు

అంతఃపురమునకు వచ్చి
అవనీశుడు ప్రియసతియగు
కైకేయిని పాన్పుపైన
గానక కడుచింతించెను

ప్రతిహారినిగని దశరథ
ప్రభువరేణ్యు డాత్రముగా
ప్రశ్నించెను కైకేయీ
రాణి యెచట నున్నదనుచు

అంతట ఆచాన భీతి
నంది కరములను మొగిడ్చి
ప్రభూ దేవదేవి క్రుద్ధ
రాలై క్రోధాగారం
బునకుబోయి యున్నదనుచు
వినయముగా మనవిచేసె

ఆ మాటను విన్నంతనె
అవనీశుడు కలతజెంది
కోపగృహంబునకునేగి
కోమలి కైకను గాంచెను

కటిక నేలబడి యుండిన
కైకనుగని దుఃఖించెను
తనచేతులచే నామెను
తడపుచు నిట్లని పలికెను

కోపమేలనే నాపై
కోమలాంగి చెప్పవె నీ
కోపకారణంబు నాకు
కొంచెమైన జ్ఞప్తిరాదు

ఎవరేమన్నారు నిన్ను
ఎందులకీ కటికనేల
పై పరుండి యేడ్చుచుంటి
వే ప్రియురాలా చెప్పవె!

నిన్నెవరైనా అవమా
నించినార! తిట్టినార!

లేక రోగ మేదైనా
సోకినదా చెప్పగదవె!

ప్రియా! అట్టివారలనే
విధిగా వధగావించెద
వైద్యశ్రేష్ఠులచే నీ
వ్యాధి నయము గావించెద

తనముద్దుల పెద్దకొడుకు
కొనరగ పట్టాభిషేక
మును జరుపగనుంటి ననెడి
మోదముతో పొంగిపోయి

కామోద్దీపితుడై ప్రియ
కాంతగూడి మనసారగ
రమియించగ తొందరపడు
రాజుబుద్ధి గడ్డితినెను

చేతివ్రేళ్ల ప్రేమతోడ
చెలి కేశములందు జొనిపి
ప్రియా నన్ను కటాక్షించి
వివరించవె యేమైనది

ప్రియురాలా! నాపై కో
పించిననే జీవింతున
ఆజ్ఞాపించిన నీకై
అగ్నిలోన దూకిపోన

అపరాధము నాచే యే
దైన నీకు గలిగిన చో
నా ప్రాణములిమ్మన్న క్ష
ణమ్ములోన నర్పింపన!

అని మిక్కిలి దీనముగా
అవనీశుడు కైకేయీ

దేవి అలుక దీర్చుకొరకు
దేహీ అని బ్రతిమాలెను

పడుచు భార్య వృద్ధుకు తన
ప్రాణము కన్నను మిన్నగు
నను లోకోక్తిని దలపిం
చెను దశరథరాజు చరిత
(వృద్ధస్యతరుణీ భార్యా
ప్రాణేభ్యోపి గరీయసి)

మరుశరములచే తపించు
మగనిజూచి కైక తనదు
కామ్యము నెరవేర్చుకొరకు
కపటబుద్ధి నిట్లన్నది

మహారాజ! నన్నెవరవ
మానించనులేదు యెట్టి
వ్యాధిసోకలేదు నాకు
బాధంతా మీ వల్లనె !

దేవా ! నా కోర్కెమీరు
దీర్చగలర! దీర్చెదనని
నాతో మీరిపుడు ప్రమా
ణమ్ముచేసి చెప్పగలర!

అని ప్రియసతి కైక పలికి
నంతనె యావృద్ధమహా
ప్రభువు దాని కుటిలమైన
పలుకులు విని పలికెనిట్లు

ప్రియురాలా ! నన్ను నమ్మ
వే నాకు ప్రియాతి ప్రియం
బైన కుమారుడు రాముని
పైన ప్రమాణము చేసెద

నీ కోరికదీర్తు కామి
నీ! చెప్పవె నీ కోరిక
నాప్రాణాలైన నిత్తు
నా రాముని పైన ఆన

రాముడంటె ఇతనికెంత
ప్రేమకదా! భతునిపై
పిసరంతయు ప్రేమలేదు
విసమంతయు వెడలగ్రక్కె

అని కైక మనంబంతయు
అసూయాగ్నిచే మండెను
తన పన్నాగంబెట్లై
నను నెరవేర్చగ నెంచెను

అయితే వినురాజా! నే
నడుగు కోర్కెలవి కొత్తవి
కావు పాతవే అవి మును
దేవాసుర యుద్ధములో

మిమ్ముల నే రెండుసార్లు
మెలకువతో కాపాడితి
మీరు రెండు వరములనను
కోరుకొమ్ముమని యంటిరి

అప్పుడు నేనంటిని నా
కవసరమున్నపుడు కోరు
కొనెదననుచు, ఆ వరముల
కోరుచుంటి నీయగలర?

ప్రియసఖి వ్యామోహములో
వివశుడైన రాజేంద్రుడు
రాబోయే ముప్పు తెలియ
రాకుండుట మోసపోయి

వేటకాని పిలుపును విని
వేగమె పరుగెత్తి లేడి
వలలోపడినట్లు కైక
వలలో పడె ధరణీశుడు

కామ వివశుడైన రాజు
కైకమాయ మాటలలో
దాగియున్న ఘోరకాల
నాగసర్పమును గానక

ప్రియురాలా! అడుగుము సం
శయమేటికి ఆవరాలు
నేనుమరువలేదు అడుగు
నెరవేర్చెద నీవరాలు

ప్రభువరు దృఢచిత్త మెరిగి
పాపి కైక ఘోరభయం
కరమైనటువంటి మాట
కటువుగ నిట్లని చెప్పెను

**వరాలశరాలు**
రాజేంద్రా! మీరిప్పుడు
రాముని పట్టాభిషేక
మునకొనర్చు సన్నాహం
బులతోనే భరతునకు ప
ట్టాభిషేకమును సేయుం
డయ్యది నామొదటి వరము

రాముడు పదునాల్గేడుల
రణ్యములో తాపసివలె
నుండ వలెను ఇయ్యది నా
రెండవ వర మివియే నా
రెండు కోర్కెలిక వీనిని
రేడా! దీర్చగ వలయును

అంతటితో ఆగక ఆ
ఇంతి ఇంక ఇట్లన్నది
ఈక్షణమే రాముడడవి
కేగుట నేజూడవలయు

రాజేంద్రా! మాటతప్ప
రాదు మీరు సత్యసంధు
లని కీర్తిగడించి నారు
ఆడి తప్పరాదు మీరు

మీ వంశము మహనీయము
మీయశమ్ము సువిశాలము
మాటతప్పి మీకీర్తికి
మచ్చతెచ్చు కొనగవలదు

అనుచు కైక నొక్కిచెప్పి
నంత దశరథేశుడు వి
భ్రాంతిజెంది మూర్ఛనొంది
కొంతవడికి తేరుకొనెను

ఇది కలయా! కాదుకాదు
ఇది నిజమే యని కైకను
ఆడపులిని గని బెదిరిన
లేడి పగిదిజూడసాగె

కైకేయీ! నీవింతటి
కఠినురాలవని తెలియక
బాలుడు తెలియక పామును
బట్టి మరణమొందినట్లు
నేనునిన్ను పెండ్లి యాడి
నిజముగ హతమై పోతిని

కపటీ! రాముడు నీకే
అపకారము చేసినాడు?

వాని నడవికంపనేల?
వంచకురాలా చెప్పవె

రాముడిచటనున్న యెడల
రాజ్యమేలలేడు భరతు
డని కాదా రాముని వని
కంపు మనుచుకోరినావు?

అందమైన మోమున్నది
డెందములో విషమున్నది
ఓపయో విషకుంభమా!
పోపోనాకంట బడకు

నీచురాల నీవు విసపు
త్రాచువు తెలియక నినునే
నింటిలోన తెచ్చిపెట్టు
కొంటిని నాశన మైతిని

పైరునీరు లేకున్నను
బ్రతుకవచ్చు కాని నేను
రాముడు లేకున్నయెడల
బ్రతుకలేను క్షణమైనను

ఓ కైకా! నీకు పుణ్య
ముండును నీపదములంటి
అర్థింతును రాముని వని
కంపు మనుచు కోరవద్దు

ఇట్లనేక విధముల ధర
ణీశుడెంత వేడుకొనిన
కైకేయీ పాషాణపు
కరకు గుండె కరుగదయ్యె!

**కైక నిష్ఠు రోక్తులు**

రాజేంద్రా! నా రెండు వ
రాలిపుడే ఇచ్చెదనని
అడిగినంత యేమేమో
నుడువు చనృత మాడనేల?

మీరునాకు మాటయిచ్చి
నారు మాటతప్ప చుంట్రి
మాటతప్పుటది మీ వం
శములోనే లేదు కదా?

మీరొక్కరు మాటతప్ప
మీ వంశము మచ్చబడద?
ధర్మమూలమగు సత్యము
తప్పిన మీకీర్తిచెడద?

నాకు వరాలీ లేదని
ఒకే అనృత మాడరాద?
విషముద్రాగి ప్రాణాలే
విడిచెదనో ధర్మాత్మా!

కైకేయీ కఠిన వచో
ఘాతములకు గుండెనొవ్వ
వృద్ధరాజు క్రుద్ధుడగుచు
రుద్ధకంఠమున నిట్లనె

**దశరథుడు కైకను దూషించుచు విహ్వాలుడగుట**

ఓసి కపటి! నీవు ముండ
మోసి భరతునకు పట్టము
గట్టిరాజ్యమేలుకొనెదు
గాక! నా కళేబరమును
తాక వలదు నీభరతుడు
నాకు కొరివి పెట్ట వలదు

కుటిలా! నీ కఠిన వచో
కుఠారఘాతములకు నా
గుండెయొకటె కాదు నాదు
కులవృక్షము కూల్చబడెను

ఇంక నాకు సుఖములేదు
ఇంక నేను జీవించను
రాము డడవి కేగిన నా
ప్రాణాలుండవు ఉండవు

నీవు స్త్రీలయందున కడు
నీచురాల వీవిక నా
యెదుట నాకు కనిపించక
నెచటి కైన వెళ్లిపొమ్ము!

ఇవ్విధి పరిపరి విధాల
నేడ్చుచు దశరథుడు వెఱ్ఱి
వానివోలె యరచుచు జీ
వచ్ఛవమటుపడి పోయెన్

ఎంతగొప్పరేడు దశర
థేశుడు! దీనావస్థను
జెందియిట్లు విలపించెను!
జ్యేష్ఠుని యెడబాయలేక!

కొడుకులందు జ్యేష్ఠుని పై
కూరిమిమెండట తండ్రికి
వని కేగిన తిరిగి రాడ
వంత అంత పడనేటికి?

తిరిగిరాని లోకాలకు
నరిగిన నీజేష్ఠుని కై
యెంతేడ్చిన రసప్రియా!
ఎట్లు తిరిగి వచ్చునయా!

ఓ నిశీధి! తొలగించకు
నీ నల్లటిముసుగును తెల
వార నీయ కిట్లాగే
ఈ రాతిరి ఉండిపోని!

అని దశరథు డకటకటా!
ఆరాటము జెందుచు ఆ
రాతిరి తెలవారినచో
రాము డడవి కేగుననుచు

ఈనిశీధి తొలగిపోక
ఇట్లాగే ఉండిపోని!
అని కోరుచువిలపించెను
అతని కోర్కనెరవేర్తున?

ఇంకెప్పుడు తెల్లవారి
యీచీకటి తొలగిపోవు
నని తహతహపడు జనంబు
అవనిలోన పెక్కురుండ

కారు చీకటింకను తెల
వారకుండ ఇట్లాగే
ఉండిపోని అనికోరిక
లుండునె యెవ్వారికైన?

కాల మెవరి కొరకైనను
ఘడియయైననాగదుకద!
తిమిరము వెలవెల బోయెను
తెలతెలవారగ వచ్చెను

శోకము లో మళ్లి మళ్లి
శోషిల్లుచు తేరుకొనెడి
రాజును గని కైక ఘోర
రాక్షసియై యిట్లనియెను

నా వరముల నెరవేర్చక
నాకు ఋణగ్రస్థుడవై
చావభ్రాంతి పడకుము నిను
చావనీను రాజేంద్రా!

నావరాలు దీర్చికాని
నాకమొ నరకమొ పోరా
దని కఠినముగా పలికెను
అతిభయంకరముగ కైక

కారడవిని గల మృగాల
కంటె పురములో వసించు
కైక వంటి క్రూరకుటిల
కఠిన స్త్రీ హానికరము

మెకముచేత ప్రాణహాని
ఒకటేకద! పురములోని
మానవమృగములచే నభి
మానహాని యును గలుగును

పడతిమూలమున యింతటి
ప్రమాద మేపురుషునకును
సంభవించి యుండదేమొ
జగతి లోన నేయుగాన!

**విధివిలాసము**

తమముతొలగినది, ప్రభా
తమ్మాయెను, రాముని ప
ట్టాభిషేకమున కవసర
మగు సర్వము సిద్ధమయ్యె

సుప్రభాతమగుచున్నది
సుముహూర్తము మించరాదు
సుమంత్రా! నీవేగి, రా
జును దోడ్కొని రావలయను

అనివసిష్ఠుడాజ్ఞాపిం
చగ సుమంత్రుడతడప్పుడు
దశరథ రాజేంద్రుని అం
తః పురమును ప్రవేశించె

అతడు రాజుసమీపమున
కరగి చేతులను మొగిడ్చి
అభినుతించి మేలు కొలిపి
శుభవార్తను దెలిపె నిట్లు

ప్రభువరేణ్య! శ్రీరాముని
అభిషేకానికి సర్వము
సిద్ధపరుచబడినది దయ
చేయగ వలయును తామిక

రాతిరి కైకేయి వలన
రాజుకు కల్గిన దుఃఖము
గూర్చి రవంతైన తెలియ
కున్నది ఆ సుమంత్రునకు

అప్పుడు రాజేమియు మా
ట్లాడు నట్టి స్థితిని లేడు
అట్టి పరిస్థితి నెరిగిన
దగు ఆ నెరజాణ కైక

ఆ సుమంత్రునకు నిజమ్ము
నావంతయు చెప్పకుండ
పచ్చి అబద్ధమ్మిట్లని
పలికినదా మాయలాడి

సుమంత్రవర! రాత్రంతా
శుభకార్య నిమిత్తము ప్రభు
వులకు నిద్ర పట్టలేదు
అలసి పోయినారు వారు

ఇపుడేనిదురించినారు
ఇటకు మీరు రాముని దో
డ్కొనిరండిదియే ప్రభువుల
కోరిక అని నమ్మబలికె

అంతసుమంత్రుడు సంతస
మందినవాడై రాముని
భవనమునకు నరిగి కైక
పలికిన విషయము చెప్పెను

సౌమిత్రి సమేతముగా
రాముడు రథమెక్కివచ్చె
వీధులన్ని నిండి జనులు
వీక్షించిరి హర్షముతో

అభిషేకమ్మున కింకా
అలస్యము దేనికనుచు
నకడక్కడ గుసగుసలవి
ఆరంభము కాసాగెను

రాముడు శ్రీఘ్రముగా దశ
రథశయనాగారమునకు
చేరవచ్చి శయ్యపై అ
చేతనుడై దుఃఖములో

బొగులుచున్న తండ్రినిగని
మిగులకలత జెందినాడు

తండ్రి పాదములకు మ్రొక్కి
తదుపరి పినతల్లి పాద
ములకు మ్రొక్కి దిగులుతోడ
నిలుచుండెను శ్రీరాముడు

రామా ! అని మాత్రము దశ
రథుడు పల్కి ఆపెనను

మాటపెగిలిరాక కనుల
మమతాశ్రులు నింపుకొనెను

అమ్మా! ఎందుకు మానా
యనగారిట్ల ప్రసన్ను
లైనారలు ఏలనన్ను
నాదరించకిట్లుండిరి

నాపై కోపము వచ్చిం
దా? నేనేమైన తప్పు
చేసితినా? లేకజబ్బు
చేసినదా మానాన్నకు?

ఎందుకు మానాన్నగారు
ఇట్లుండిరి దుఃఖించుచు
ఏమి జరిగినదో సందే
హించకుండ చెప్పవమ్మ ?

అని రాముడు కైకేయిని
అడిగినంత అప్పుడామె

రామా! మీనాన్నగారి
కేమియు కోపమునులేదు
దుఃఖమదియులేదు జబ్బు
నిక్కముగా లేనెలేదు

మహారాజు నీతో తన
మనసులోనిమాటచెప్ప
టకు భయపడుచుండిరి అం
దుకు నీతో మాట్లాడుట
కరమరపడుచుండిరి, అది
యంతయు నేచెప్పదవిను,
మనుచు కైక సిగ్గువిడిచి
అన్నదిట్లు రామునితో

మును దేవాసురుల యుద్ధ
మున నే మీ నాన్నను ర
క్షించినందుకాయన నా
కిచ్చెను రెండు వరంబులు

ఆరెండు వరాల నిప్పు
డడిగితి నెరవేర్చుమనుచు
సరే అడుగుమని నాతో
శపథమ్మును చేసినారు

తీరా నేనావరముల
తీరును వివరించినంత
వాటిని నెరవేర్చలేక
బాధపడుచునున్నారలు

ఆడితప్పయత్నించుట
పాడికాదు నీవైనా
చెప్పుము మీరఘుకుల వం
శీయులకిది తగదంచును

మహారాజు నాకిచ్చిన
మాటను నిలబెట్టునట్లు
చేయగలనటంచు నీవు
చేయుము నాతోశపథము

అపుడుకాని నీతో నే
నా విషయము వివరించను
ఆయన వగదీర్చు భార
మంతయు నీపైనున్నది

కైక మాటవిని రాముడు
కలతజెంది తనమూలము
గా తనతండ్రికి కష్టము
గలిగె నంచు వగజెంధెను

ఎంతచతురురాలుకైక
ఏమాటకుకాని ముందు
శపథము చేయనిదే తన
కపటవాంఛ ప్రకటించదు

అతిచాతుర్యముగల ఆ
అతివ నమ్మ దెవరినైన
అతి చతురతగల వారలు
అతి ప్రమాద కారకులట

రామమూర్తి సత్యపరా
క్రముడనియును తెలిసిగూడ
శపథము చేయించిగాని
విపులించదు తనకోరిక

అమ్మా! వేవేగమె చె
ప్పుమ్మా! మానాన్నగారి
కే కష్టము నావల్లను
రాకూడదు చెప్పుమ్మా!

నాన్నసుఖమె నాసుఖమ్మ
నాన్న మాటనెరవేర్తును
నాన్నకొరకు నాదగు ప్రా
ణాలైనా ఇవ్వగలను

శపథమిదే చేయుచుంటి
సందేహించక చెప్పుము
మానాయన మీకిచ్చిన
మాటయేమిటో చెప్పుము

శీఘ్రమె నెరవేర్చగలను
చెప్పుమ్మా ఆవిషయము
శపథమిదే చేయుచుంటి,
సత్వరమే చెప్పుమ్మా!

అని రాముడు ఒట్టుపెట్టు
కొనిగట్టిగ పలికినంత
తనకార్యము సిద్ధించిన
దనచు కైక పొంగిపోయె

శ్రీరాముని దొకే మాట
చేసిన శపథము తప్పడు
నా కార్యము ఫలియించెను
నా కోరిక నెరవేరెను.

అని ఆ అతిచతురురాలు
ఆవంతైనను సిగ్గూ
భయమూ లేనట్టి దగచు
పలికిన దీవిధముగాను

తండ్రిమాట నిలబెట్టగ
తగినకొడుకు వీవేయని
నాకు తెలుసు రామా ఇక
నాకోరిక తెలిపెద విను

భరత కుమారునకు నీకు
బదులుగ పట్టము గట్టుట
నీవు నారబట్టలు ధరి
యించిపదియునాల్గేడులు
దండకనుండుట, ఇవి నీ
తండ్రిని కోరినవరములు

ఇవియే నీతండ్రి నాకు
ఇచ్చిన వరములు వీటిని
నెరవేర్చుట నీవిధి వని
కరుగవలయు నీవిపుడే

ఆమాటలు విన్నరాము
డావంతయు చలియించడు

కాని దశరథేశుని కెద
లోన పొడిచి నట్లాయెను

అమ్మా! నీకోర్కెదీర
అడవి కిపుడె వెడలెద,నా
తండ్రిమాట నిలబెట్టెద
తల్లీ! ఇది నావిధి అని

రాముడిట్లు కృతనిశ్చయు
డై మాట్లాడెను అదివిని
కైక హృదయముప్పొంగెను
కార్పణ్యమె గెలుపొందెను

కొరడాదెబ్బకు వెంటనె
పరుగుదీయు గుర్రమట్లు
వెనువెంటనె రాముడడవి
వెళ్లుటకై నిశ్చయించె

రాముడింక యిట్లని మా
ట్లాడసాగె అమ్మా ఈ
మాటకింత నాన్నగారు
మది సంకోచించ నేల?

ఈమాటను స్వయముగ తా
నే చెప్పిన బాగుండును
నాన్న అజ్ఞ తలదాల్చుట
నాకర్తవ్యము కాదా!

సంతోషంబున మదీయ
జనకు నాజ్ఞ పాలింతును
మునివేషంబున నిపుడే
మనముకేగుచున్నాడను

కానీ నాకొక్కబాధ
కలుగుచు నున్నది జనకుడు

వృద్ధు డతని నిరంతరము
శ్రద్ధతోడచూచుకొనుము

అని తండ్రికి కైకేయికి
అభివాదమొనర్చి రాము
డచటినుండి వెళ్లెనంత
హా! యని దశరథుడేడ్చెను

**కౌసల్య**
రాజభోగములను వీడి
రాముడు వనికేగనెంచి
కైకేయీగృహము వీడి
కన్నతల్లి గృహమేగెను

రాజ్యము పోయిన గానీ
రామునిలో కొంచెమైన
వగకనుపించదు చంద్రుని
వన్నె రేయి దరుగనట్లు

పుత్రాభ్యుదయమ్మునకై
రాత్రియంత పూజచేసి
విప్రులచే హోమముగా
వించుచుండె రామజనని

తల్లిపాదయుగళికి వం
దనమొనర్చు రాముని కౌ
సల్య ప్రేమ చేరదీసి
సంతోషంబున నిట్లనె

రారా! నాయన రామా!
రాత్రియంత ఉపవాసము
చేసినావు ఫలహారము
చేతువుగానీ ఇటురా!

అనుచు పీటవేసె నంత
ఆరాముడు తల్లితోడ

అమ్మా నీకేమి తెలియ
దనుచు ఇట్లుబదులాడెను.

అమ్మా! కైకమ్మ కోర్కె
సమ్మతించి నాన్నగారు
నన్నడవికి పంపి భరతు
నకు పట్టము గట్టనుండె

ఈపీటలు నాకేటికి
ఇక దర్భాసనమె నాకు
వలయును మునిచందమునే
వనవాసము చేయవలయు

పదునాల్గేడులు నేనిక
వనవాసము చేయుటకై
వెడలుచుంటి నిపుడే దీ
వించిపంపు మమ్మనన్ను

అనుచురాముడన్నమాట
లను వినియా మహారాణి
గొడ్డలిచే నరుక బడిన
కొమ్మవోలె నేల బడెను

మూర్ఛిల్లిన తల్లిని రా
ముడు తిన్నగ లేవనెత్తి
తనచేతను తల్లితనువు
తడుముచు నాశ్వాసించెను

కౌసల్యాదేవి యంత
కటకట దుఃఖంచుచు ల
క్ష్మణుడు వినగ గట్టిగ ని
ట్లని పలికెను గద్గదముగ

నాన్నా దుఃఖించుటకే
నా నినుకన్నది గొడ్రా

లిగనుండిన సంతానము
లేదను సొద ఒకటేకద!

కాని సుతవియోగముచే
కలుగుదుఃఖమది భరింప
రానిదిరా! నాతండ్రీ!
కానలకేగుట మానుము

నీ వడుగప్పటి మొదలుగ
నేటికి పదునేడేండ్లుగ
నీకు యౌవ్వరాజ్య మొదవు
నాకష్టముబాయు ననుచు

కోరిక తీరగ దినములు
కొడుకా! నేగడిపినాను
అని వాపోయెడి కౌస
ల్యమ్మ దుఃఖమును జూచిన

లక్ష్మణునకు పట్టరాని
తీక్ష్ణకోప మది కట్టలు
తెంచుక రాగానాతడు
తెంపుగ నిట్లని పలికెను.

**లక్ష్మణుడు**

అమ్మా! ఈ ముసలిరాజు
ఆడదాని మాటలువిని
అన్యాయముగా అన్న
య్యకు శిక్షవిధించినాడు

వృద్ధుడగుట మతిచలించి
బుద్ధిమాలి అన్నయ్యకు
యే అపరాధము లేకయె
ఈశిక్ష విధించినాడు

కామవశుండై ఇట్టి య
కార్యము గావించినాడు

కాన కాముకుడు విధించు
ఆనను పాటించరాదు

రాముని ద్వేషించువారు
భూమిపైన లేనె లేరు
శత్రువైన శ్రీరాముని
శ్లాఘించును ప్రేమించును

అట్టి రామచంద్రుడిప్పు
డడవి కేగవలసినట్టి
అపరాధమ్మేమిచేసె
నడవికేల వెళ్లవలయు?

అగ్రజ! నాకెంత మాత్ర
మంగీకారము కాదిది
అన్యాయంబిది దీనిని
అరికట్టుటె న్యాయమగును

అన్నయ్యా! ఆజ్ఞ నిమ్ము
ఆముదుసలి కామాంధుని
ఈక్షణమె వధింతునీవు
వీక్షించుచునుండుమిపుడు

ఎవ్వరడ్డు పడినగాని
ఈధనుర్బాణంబుల
నందరిని హతమ్మొనర్తు
నయోధ్యగంగలోగలుపుదు

ధర్మాధర్మ విచక్షణ
తగసేయక తెలిసితెలసి
తనకెవరడ్డని మదమున
తప్పుత్రోవ పట్టువాని

తండ్రినైన గురువునైన
దండింపందగు నియ్యది

ధర్మశాస్త్రసమ్మతమని
తగవాక్రుచ్చిరి ఆర్యులు

దుష్టుడైన తండ్రి దశర
థుని జంపుదు లేని యెడల
తండ్రికదా యని కఠిన
త్వమునువీడి బంధిం.

భరతుని పక్షమువహించు
పగతురనెల్లర వధించి
క్షణములోన రాజ్యమంత
స్వాధీనము చేసికొనుము

మెతకదనము మనబలహీ
నతగ నెంచి బాధింతురు
కరుకుదనము కలిగిన మన
నొరు లెవ్వరు బాధింపరు

అన్యాయము నరికట్టుద
మన్నా! నాకాజ్ఞనిమ్ము!
క్షణములోన రాజ్యమునీ
స్వాధీనము గావింతును

తనకుగల్గినట్టి దుఃఖ
మునకంతము గలుగునేమొ
యని కౌసలమ్మ లక్ష్మ
ణుని మాటలు నాలకించి

**కన్నతల్లి వాదన**

రామా! వింటివి కాదా!
లక్ష్మణుడాడిని మాటలు
యిక నీకది సమ్మతమగు
నేని యట్లగావించుము

కైక చెప్పినట్టి ధర్మ
ఘాతుకమగు మాటలువిని
నను దుఃఖంబున ముంచగ
వనములకీవేగవలదు

సకల ధర్మవిదుడవీవు
జనునిని సేవించుచు ని
చ్చటనే యుండినచోనది
సద్ధర్మాచరణమె కద!

తండ్రిమాట ననుసరించ
ధర్మమైన తల్లిని నా
మాటననుసరించుట ధ
ర్మము కాకుండున రామా!

నేను సమ్మతించని పని
నీవది పాటించరాదు
నామాటను పాటించి వ
నాలకు నీవేగరాదు

నిన్నువిడచి బ్రతుకలేను
నన్ను దుఃఖమున ముంచి వ
నాలకు నీవేగకురా!
నాతండ్రీ! శ్రీరామా!

కొడుకా! నీవొక్కవేళ
అడవికేగ తప్పనిచో
ఆవుదూడననుసరించు
నట్లునేను నీవెంటను
అడవికి వచ్చెద గొనిపొ
మ్మని పలికెను కన్నతల్లి

కౌసల్యాదేవి యిట్లు
గాసిల్లుచు రాముని వన
ములకేగుట మానుమనుచు
పలువిధముల వేడుకొనెను

**రాముని సమాధానం**

విలపించెడు తల్లినిగని
విదితాత్ముడు రాముడిట్లు
బదులు పలికినాడు ధర్మ
బద్ధుండై స్పష్టముగా

అమ్మా నీమాటనే నవ
శ్యము పాటించవలయు
కానీ నాతండ్రి మాట
కాదని జవదాటలేను

నీ మాటకు ముందుగ జన
నీ!జనకుని ఆజ్ఞగొంటి
అతని ఆజ్ఞ నెరవేర్చెద
నని శపథము చేసియుంటి

మాటతప్పరాదు తండ్రి
మాటనిలుపుటది నా ధ
ర్మము, ధర్మము సత్యముపై
మనుచునుండు మహిలోపల

మాటతప్పి సత్యంబును
మట్టుపెట్టి ధర్మంబును
చెరుపలేను ధర్మహాని
చేమానవహానికలుగు.

అమ్మా! నీ మాటను కా
దన్నందుకు మన్నింపుము
తండ్రిమాట నిలుపుటకై
తప్పను నేనిడినమాట

సతివగు నీకైనపతిని
సత్యహాని నుండిగాచు
కొనుట సతికి ధర్మము కా
దనగల వారున్నారా!

బ్రతికినన్నినాళ్లు సతికి
భర్తయె దేవుడు ప్రభువును
ఆడుది మరియెవ్వారిని
ఆశ్రయించి యుండరాదు

సతత వ్రతములు నుపవా
సములుచేయు నుత్తమ సతి
భర్త ననుసరించ దేని
పాపిష్ఠిది యగునుకదా!

పతిని విడిచి యుండిన స్త్రీ
పాపమంది పతిత యగును
పతి సహచారణిగ నుండు
సతి బ్రతుకే బ్రతుకుకదా

భర్త సాహచర్యముతో
బ్రతుకుటయే సతిధర్మము
భర్తను విడి జీవించెడి
భార్యబ్రతుకు కడుహీనము

తల్లితోడ రాముడిట్లు
ధర్మసమ్మతముగ నుడివి
పిదప లక్ష్మణునితో ఇ
వ్విధినొప్పగ మాట్లాడెను

మమతావేశముచే స
త్యమును విస్మరించినదై
అమ్మఇట్లు మాట్లాడిన
దనుజా! ఇది మాతృప్రేమ

తండ్రికి నే మాటయిచ్చి
తప్పుట ధర్మంబగునా!
తండ్రిఆజ్ఞ పాలించుట
తనయుని ధర్మముకాదా!

నాఅభిషేకమునిలుపుట
నన్నడవికి పంపుమనుట
కైకమ్మకు దైవికముగ
కలిగినట్టి కోర్కెగాని

ఆమెకు నాపైవాత్స
ల్యముగొప్పది ఆమెకిట్టి
విపరీతపు ఆలోచన
విధికల్పితమైయున్నది

ఇందుకు కారణ మెవ్వర
మేమాత్రము కాదు దైవి
కమునడ్డగ దైవానికె
కాసంతయు వశముగాదు

ఈయధార్థమెరిగిన నా
కేపరితాపము కలుగదు
అసమద్రాజ్యాభిషేక
మాగిపోయినను లక్ష్మణ!

నన్ను జనకు డాజ్ఞాపిం
చగలేదందువా! జనకా
జ్ఞను గొనియె కదా! కైకమ
నన్నడవికి పొమ్మన్నది

తండ్రిమాట నిలబెట్టెడు
ధర్మము పాటించి నేను
అడవికేగ నిశ్చయించి
తనుజా! నన్నాప వలదు

ఇట్లు లక్ష్మణుని తో వచి
యించిపిదప తల్లికి కై
మోడిచి సాష్టాంగంబుగ
మొక్కి రాము డిట్లుపలికె

అమ్మానే నయోధ్యవిడి
అడవి కేగ నిశ్చయించి
తిని నాతప్పులుచెప్పక
నను దీవించుము చల్లగ

జననీ! నాకేమియు క
ష్టములు గలుగ కుండునట్లు
నను చల్లగ దీవించుము
నన్ను గన్న అమృతవల్లి!

రాము డిట్లు జనకాజ్ఞ
ప్రకారమున నడవికేగ
కృతనిశ్చయుడైయుండుట
నెరిగి తల్లి పలికె నిట్లు

నాయన! రామా! నీని
ర్ణయము మార్చలేనైతిని
ఏమిసేతు ఈశ్వరేచ్ఛ
యిట్లున్నది కాబోలును

రామా! నీయిష్టప్రకా
రమె వనములకేగిరమ్ము!
పదునాలుగు వత్సరముల
పిదప మరల తిరిగి రమ్ము!

**మంత్రాశీర్వాదములు**

అని తనయుని రక్షణకై
ఆ కౌసల్యమ్మ బుత్వి
జాదులచే మంత్రాశీ
ర్వాదంబుల జరిపించెను

నియమముతో నిష్ఠలతో
నీవేధర్మమును గాచు

చున్నావో అధర్మమె
నిన్నెప్పుడు రక్షించుత!

జననీజనకులసేవా
జనితఫలము సత్యవ్రత
ఫలమును నీకష్టములను
బాపినిన్ను రక్షించుత!

నీవే యేదేవతలను
నిత్యముగొలుచుచునుందువో
ఆయా దేవతలు నిన్ను
అనయము రక్షంత్రుగాక!

పుణ్యచరిత్రుడ వగుటను
పూజ్యుడుగాధేయుడు నీ
కిచ్చిన అస్త్రాదులు ని
న్నెల్లప్పుడు రక్షించుత!

క్రూరపిశాచాదులచే
ఘోరరాక్షసాదులచే
వ్యాఘ్రాదులచే నీకే
భయము గలుగకుండుగాక!

ఇట్లనేక రీతుల కౌ
సల్య సకల దేవతలను
ప్రార్థించెను పిదప మంగ
ళాశాసనములనొసగెను

**మంగళాశాసనములు**

శత్రువైన వృత్రాసురు
జంపుటచే యింద్రునకే
మంగళంబు గలిగెనో యా
మంగళంబు నీకొదువుత!

మును గరుడుడు సుధగొని తే
బోవునపుడు వినత యతని
కే మంగళమొసగెనో నీ
కామంగళ మగునుగాక!

అబ్ధి మథనమప్పు డసుర
వధకై యింద్రునకు నదితి
యేమంగళ మొసగెనో నీ
కామంగళ మగునుగాక!

మూడడుగుల నేల గొలువ
బోవునపుడు విష్ణునకే
మంగళమొద వెనో నీకా
మవంగళమొదవును గావుత!

ఋతు జలధి ద్వీపంబులు
శ్రుతులు దిశలు లోకంబులు
మంగళకరమైన వన్ని
మంగళములు నీకొసగుత!

అని తనయుని శిరముపైన
అక్షతలుంచి సుగంధము
నలదియును, విశల్యకరణి
యనెడి మూలికను రక్షగ
ముంజేతికి గట్టి మంత్ర
మును జపించి తలమూర్కొని
కౌగిలించుకొని గద్గది
కముతో ఇట్లని పలికెను
కౌసల్యా మహారాణి!
కాకుత్థ్సుని కన్నతల్లి!

మానాయన వెళ్లిరమ్ము!
మరలి వచ్చి ఈ అయోధ్య
ప్రేమతోడ పాలించుము!
క్షేమంబగుగాకనీకు!

ప్రయాణమును సేయునపుడు
పలుక రాదమంగళ మని
లోన దుఃఖమెంతయున్న
గాని పైకి రానీయక
కడుపుకోత లోలోపల
నడచుకొనుచు మాటమాత్ర
మునకు వెళ్లిరమ్మన్నది
మనసొప్పని కన్నతల్లి!

## ద్వితీయాశ్వాసము

**సీతకువనవాసవార్తచెప్పట**

కన్నతల్లితోడ సెలవు
గైకొని తనభార్యసీత
దగ్గర కరుదెంచినాడు
ధర్మజ్ఞుడు శ్రీరాముడు

అభిషేకార్థంబయి వ్రత
మవలంభించిన సీతకు
రాముని వనవాసవిషయ
మేమాత్రము తెలియదకట!

వెలబాటిన పతిమోమును
వీక్షించిన సీత మిగుల
కలతజెంది అతని వగకు
కారణమేమని అడిగెను

అంతరాము డీ ప్రకార
మవని సుతకు వివరించెను
విషయ మప్రియింబైనను
వివరించక తప్పదు కద!

"జానకి! మునుపెపుడో మా
జనకుడు తనకిడిన వరము
లిపుడు దీర్చమన్నది స్వా
ర్థేచ్ఛను కైకేయి పిన్ని

పదునాల్గేడులు అరణ్య
వాసము నేసేయవలయు
భరతుని యువరాజ్యపట్ట
భద్రునిగ నొనర్చవలయు"

అని ముందుగ పతిచే మా
టను గైకొని తనకోర్కెల
పిదప చెప్పుకొన్నది, వల
విసరి పట్టుకొను విధమున

వలను చిక్కువడిన మృగము
వదలించు కొనంగ లేదు
మాట ఇచ్చికాదను టది
మహారాజు పథముకాదు

ఈ రెండు వరాలబట్టి
నేనరణ్యవాసమునకు
ప్రయాణమై పోవుచుంటి
భరతునకభిషేకమగును

భరతుడిపుడు రాజుగాన
వాని సమీపాన నన్ను
శ్లాఘించకు శ్రీమంతులు
సైచలేరు పరస్తుతుల

నీపోషణ బాధ్యత వా
నికి యుండదు కేవల బం
ధువుగా నిను పోషించును
తొందరపడ వలదునీవు

శీలవతీ! భరతున కను
కూలముగా నుండవలయు

కాని యెడల వానిసమీ
పాననుండ లేవు నీవు

కళ్యాణీ! నీవు ఉషః
కాలమందు నిద్రలేచి
యథావిధిగ సకలదేవ
తార్చనలను గావించుము

నాతండ్రికి నాతల్లికి
నాతదితర తల్లులకును
గౌరవాభివాదంబుల
గౌరవించు మనునిత్యము

నాకు ప్రాణసమములైన
నాతమ్ములు భరత శత్రు
ఘ్ను లక్ష్మణుల, భ్రాతృపుత్ర
తుల్యులుగా జూచుకొనుము

భరతుడు ప్రభువగుటచేత
ప్రతికూలించకు వానికి
ప్రతికూలురు పుత్రులైన
పరిత్యజింతురు ప్రభువులు

సాధారణ జనులైనను
సమర్థులై తమహితమును
గూర్చువారలగుదురేని
కూర్మి వారి దరిజేర్తురు
కనుక నీవు రాజగు భర
తున కనుకూలముగనుండి
ధర్మము వదలక సత్యము
తగ నవలంభించుచుండు

ఇక నేనీ పురము వీడి
ఏగుచుంటి కారడవికి

నీవు స్త్రీవి యగుటచేత
నావెంటను రాదగవు గ
దా! యెవరికి నీపై క్రో
ధము రానటు వర్తించుము

ఇదే నేను చెప్పుమాట
మదిలో దీనిని మరువకు
మని రాముడు పలికినంత
అవనీసుత ప్రణయ కోప
మును బోలిన అలుకబూని
ములకులపలుకులు పలికెను

**సీతారామ సంవాదము**

"రామచంద్ర! నీవిప్పుడు
రాజకుమారుడవై నా
వంటి ఆడదానికైన
పరిహాసము సేయదగిన
పనికిమాలినట్టి మాట
లనుపలుకుచునున్నావే!

ఎన్నడైననీనోటను
విన్నానా ఇట్టిమాట
లేమి విచిత్రము రామా!
ఎగతాళికి ఇట్లంటివ?

తల్లిదండ్రి తోబుట్టువు
తనయుడు కోడలు చుట్టం
బులుతమతమ పుణ్యపాప
ఫలములచే గలుగు శుభా
శుభకర్మలు తామెపొందు
చున్నారలు పుడమి కాని

భర్త కర్ధ శరీరమగు
భార్యయొకతె తనభర్తకు

కలుగు శుభాశుభకర్మల
నిల దానును పొందుచుండు

అట్లగుటను జేసి నిన్ను
నాజ్ఞాపించుట చేతనె
నన్నును వని నుండుట కా
జ్ఞాపించిన విధమాయెను

స్త్రీలకు మాతాపితరులు
చెలికత్తెలు తోబుట్టులు
సుతులును మరియెవరుకాని
గతి కానేరరు-కానీ
పతి యొకడే వారలకిహ
పరములందు గతియౌనిల

నాథా! నీవిపుడె అర
ణ్యాలకు బోనుంటివేని
నేనుముందుగా నడచుచు
నీపాదములకు కష్టము
కలుగకుండునట్లు కంట
కములనేరి త్రోవసేతు

రాజభోగములకన్నను
రామా!నిన్ననుసరించి
నీపదముల సేవించుచు
నీనీడను నుంటమేలు

నిన్ను గూడి అడవులందు
ఎన్నివేల యేండ్లైనను
గడుపగలను నిన్ను వీడి
గడుపలేను క్షణమైనను

నీకష్టమె నాకష్టము
నీ సుఖమే నాసుఖమ్ము

నీవనవాసమునుగూడ
నేను పాలుపంచుకొనెద

నీకు తోడునీడ నగుచు
నీవెంటను వచ్చెద శ్రీ
రామా! నే నీభాగ
స్వామిని ననువారించకు"

అని సీతాదేవి పలికి
నంతనె శ్రీరామమూర్తి
వనవాసపు కష్టంబుల
వర్ణించుచు నిట్లనియెను

"జానకి! నామాటవినుము
చక్రవర్తి బిడ్డవు సుకు
మారివి భరియించలేవు
కారాటవి కష్టంబుల

ఘోరభయంకర మృగములు
క్రూరసర్పములు విచ్చల
విడిగా తిరుగాడుచుండు
అడుగడుగున పెనుగండము

ఘాతుకమృగగర్జలు, జల
పాతఘోష,ఘోరభయం
కర పక్షుల యరుపులు దు
ర్భరముగనుండును వినుటకు

సీతా! నీమేలు గోరి
చెప్పుచుంటి వనవాసము
ముప్పులతోగూడినదై
యెప్పుడు కష్టమెకలుగును

అడవియందు నేమియు నా
హారము లభియించకుండు

ఉపవసించవలసివచ్చు
చుండు తరుచుగా సీతా!

ఆహారములభింయించదు
ఆకలియధికముగ నగును
అడవినుండ తగవునీవు
అడవికి రావలదువలదు

చినదానా! ఏమాత్రము
వనవాసము నీకుతగదు
అబలవు నావెంటను నీ
వడవికి రావలదువలదు:"

అని రాముడు సీతమీది
అనురాగముతో బలికెను
కాని ఆమె అతని మాట
కాసంతయు వినదయ్యెను.

అడవినుంట బహుకష్టం
బని రాముడుయెంతచెప్పి
నను జానకి యతనిమాట
లను సుంతయునొప్పుకొనదు

తనవెంటను రావద్దను
పెనిమిటి మాటలకు సీత
కండ్లనీళ్లు నించుచు దుః
ఖముననిట్లు బదులాడెను.

'రామా! నీతోడున్న అ
రణ్యవాస కష్టంబులు
కలుగవు నీతోడులేక
కలుగుచుండు కష్టంబులు

అతుల పరాక్రమవంతుడ
వగుటయెట్టి కష్టంబులు

కలుగకుండు నీకునన్ను
కాపాడుట కష్టమగున?

తండ్రి ఇంట నున్నప్పుడు
దైవజ్ఞులు నాకుకొంత
కాలము వనవాసమ్మది
కలదని వాక్రుచ్చినారు

వనికి బోదు నెప్పుడెప్పు
డని ఉత్సాహముననుంటి
బుధులు చెప్పినట్లడవికి
బోవలసిన దాననెకద!

అడవియందు నెన్నెన్నో
అందమైన వృక్షంబులు
అంబరమును చుంబించెడి
అద్రిరాజశిఖరంబులు

శిఖరాగ్రమునుండి దూకు
సెలయేరులు, పూబోడులు
తలనిండా పూదండలు
దాల్చినట్లు పూలచెట్లు

చెంగలించు హరిణంబులు
చిత్రవర్ణ విహగంబులు
జలజల ప్రవహించెడి ని
ర్ఘరతరంగ పరంపరలు

సుందర వన సౌందర్యము
చూడాలని యుందినాకు
రామా! నాయీ ముచ్చట
ప్రేమతోడ దీర్చలేవ!

ఆ జనకజ ముచ్చట రా
మయ్యకు దీర్చగ భరమా?

కాని ఆమె వనవాసపు
కష్టాలు భరింప జాల
దని మనసొప్పక రాముడు
అడవికి రావలదనియెను

అంతసీత దుఃఖాతిశ
యమున కినుక జెందినదై
నిష్ఠూరము లాడెను క
న్నీళ్లు కంట నింపుకొనుచు

జనక మహారాజు నాదు
జనకుడు నిను శూరుడవని
తలచిగాక నన్ను నీకు
ధారవోసి పెండ్లిజేసె

కాని నీవు పురుషాకృతి
గల స్త్రీవని తెలిసినచో
నన్నునీకొసంగి యుండు
నా రామా! శ్రీరామా!

ధర్మమునకు మారుపేరు
దాల్చిన వాడవు నీవై
ధర్మపత్నినగు నను విడి
దండక కేగెద నందువు

అడవి నుండుమని నీపిత
ఆనతి నీకిడినట్లే
నను నీసహచరిగ నుండు
మని నాపిత ఆనతినిడె

ఇయం సీతా మమసుతా
సహధర్మచరీతవ అని
నాపిత కళ్యాణవేళ
నను నీచేతుల బెట్టెను

తండ్రి మాట నిలబెట్టగ
ధర్మము పాటింతువీవు
తండ్రి మాట నిలబెట్టగ
ధర్మము పాటింతునేను

నీధర్మము నీకు ప్రియము
నాధర్మము నాకు ప్రియము
నీధర్మము నాధర్మము
నీవే రక్షించ దగుదు

ధర్మము తనదైన పరుల
దైన దాని రక్షించుట
రాజులవిధి నాధర్మము
రక్షించుట నీవిధియగు

ధర్మరక్షణార్థము నను
దండకగొని పోవలయును
కాకుండిన ధర్మహాని
కలుగకుండ తప్పునెట్లు?

(ఇది రావణవధ సూచిత
మెదలో నూహించగనగు!
సీతలేక రావణవధ
ఏతీరున సంభవమగు?)

'ఇల్లే ఇల్లాలు' నీవు
యెందున్నను నేనందే
యండినచో నీవింటను
నున్నట్లే సుఖియింతువు

నీవు పరాక్రమశాలివి
నీకు నన్నుగాపాడుట
భారము కానేకాదిక
భయమా ననుగొనిపోవగ

నీవే నాదేవుడవని
నిన్నే నమ్మిన నన్నిటు
వదలి పెట్టి నీవొకడవె
వనములకేగెద నందువు

నీతోడను అడవి కైన
నిజముగ స్వర్గముగనుండు
నీవులేక దివి నైనను
నిజముగ నరకముగనుండు

నీవియోగబాధచేత
నిమిషమైన బ్రతుకలేను
పదునాల్గేడులు నినువిడి
బ్రతికి యుండలేను గాన

నీవెదుటను లేనప్పుడు
నిహతనగుట కంటెను నీ
చరణకమలముల కడనే
చచ్చుట మేలగునుగాన

విషము మ్రింగి ప్రాణములను
విడుతు వెంటనే నీపద
పద్మంబుల పైబడి నా
ప్రాణేశ్వర అడ్డుకొనకు

అని జానకి దుఃఖాతిశ
యమ్మున రాముని గట్టిగ
కౌగిలించుకొని హా!యని
గట్టిగ వలవల యేడ్చెను

శోకంబున మూర్ఛిలు, భూ
సుతను కేల కౌగిలించు
కొని రాముడు మృదువుగ ని
ట్లని ఓదార్చుచు పలికెను

**రాముని అంగీకారము**

ఓసీతా! నీకు దుఃఖ
మొదవునేని నాకు స్వర్గ
మైనను ప్రాప్తించిన అ
ద్దాని గూడ లెక్కించను

బ్రహ్మదేవునకు నెందును
భయములేని పగిదినాకు
దేని వలన భయములేదు
దేవీ నిన్నడవిలోన

కాపాడగ శక్తుడనై
కానకు రావలదంటిని

ఇందుకు కారణమొకటే
ఇందువదన! నీమనస్సు
తెలియక నిన్నడవికి రా
వలదంటిని కష్టమనుచు

నీవిన్ని విధంబుల నా
తోవనముల నుండుటకై
దృఢ నిశ్చయముననుంటివి
ఇక నిన్నిట విడనాడను

ధైర్యవంతు డేనాడును
తనకీర్తిని వీడనట్లు
నిన్నువిడిచి వెళ్లను క
న్నీరు పెట్టు కొనకు సఖీ!

నావెంటను నీవు అర
ణ్యాలకు రావలయు సఖీ!
నిను విడియుండుట క్షణమై
నను యుగమైపోవు చెలీ!

నాతోడుగ నీవుండిన
నరకమైన స్వర్గమగును

నీవులేని స్వర్గమైన
నిజముగ అదినరకమగును

కావున నీవిక నాతో
కానల కరుదెంచుము నా
అర్ధాంగివి నాకష్టము
లందుపాలు పంచుకొనుము

అని రాముడు పలికి నంత
జనకజ కూరట కల్గెను
మూర్ఛదేరుకొని ప్రాణము
లేచి వచ్చి నట్లాయెను

జనకజ రాముని అనుమతి
గొని అరణ్యవాసమునకు
పయనమగుచు బిక్షకులకు
బ్రాహ్మణులకు యథేష్టముగ
ధన మణి కనకాంబరాదు
లను దానము గావించెను

**లక్ష్మణునిప్రార్ధన**

తనలో సగమగు సీతను
వనికి వచ్చుటకు ననుమతి
నింత కష్టముగ నిచ్చెను
ఇక నన్నేమనునోయని

తలచి లక్ష్మణుడు ముఖమం
తయు నశ్రులు గమ్ముకొనగ
అన్నా! యని రామమూర్తి
అంఘ్రులపై బడిపోయెను

అన్నయ్యా నీవెంటను
అరుదెంచెద నీముందుగ
ధనుర్ధారినై నడిచెద
అనుమతీయ గదే నాకు

నీవు సీతతోడ కొండ
నెత్తమ్ములు విహరించుచు
నుండ నేను పనులన్నియు
నొనర జూచుచుండ గలను

అన్నయ్యా! నీవులేక
ఆవైకుంఠమునందున
నైన నుండనొల్లను నీ
తోనే నాజీవనమ్ము

నినుసేవించుచునుండుటె
నీతోడుగ నుండుటయే
నాజీవనపరమార్ధము
నాకదియే వైకుంఠము

మీరు నిదురపోయి నపుడు
మేల్కొనియున్నపుడు మిమ్ము
కంటికి రెప్పగ నెప్పుడు
గాపాడుచు నుండగలను

అన్నా! రామన్నా! నీ
కన్న నాకు దేవుడెవరు?
నిన్ను వీడి యుండలేను
నీసేవల నుండ నిమ్ము

అనుగు తమ్ముడగు లక్ష్మణు
డంతగ అర్థించగ కా
దనలేకను రాము డతని
కనుమతి నిడి నాడప్పుడు

తత్క్షణమే లక్ష్మణుండు
తన వారల కందరితో
చెప్పివారి యనుమతి గొని
శ్రీరాముని కడకు వచ్చె

అతని భ్రాతృస్నేహమ్మది
అంతింతని అనగ రాదు
అర్ధాంగిని నైన వీడి
అన్నవెంట వెడలి వచ్చె

రాముడతని ఆత్మాలయ
రాముడగుట ఆరామ
స్వామిని సేవించుటకై
సర్వస్వము విరజిమ్మెను

అన్నసేవ కవరోధం
బగునని తనసతినివెంట
రావద్దనగా పతికెదు
రాడకతని యభిమతమును
పాటించుచుపతియాజ్ఞను
పాలించిన దాఊర్మిళ!

తండ్రిగ నీ అన్నయ్యను
తల్లిగ నీ వదినమ్మను
అరణ్యము నయోధ్యగాను
అత్మనెంచి ప్రవర్తించు

మని సుమిత్ర లక్ష్మణు శిర
మును మూర్కొని దీవించెను
పుణ్యదంపతుల సేవకు
పుత్ర్యత్యాగముచేసెను

రాముడంత సొంత ద్రవ్య
రాసుల బీద ప్రజలకు
బ్రాహ్మణాది సాధువులకు
పంచిపెట్టి నాడప్పుడు

**త్రిజటుడు**

త్రిజటుడనెడి ముసలిపేద
ద్విజుడు బహుకుటుంబీకుడు

బక్కచిక్కి చిరిగినట్టి
బట్టలతో వచ్చినాడు

అతని వెంట కోడిపిల్ల
లటు పిల్లలు పడుచుభార్య
నడచిరాగ వృద్ధబ్రాహ్మ
ణుడు రాముని సమీపించి

రాజపుత్ర! తావక విత
రణముగూర్చివిన్నాడను
నిరుపేదను బహుసుతుడను
నీవు కటాక్షించవలెను

అవృద్ధును అతని పడుచు
టాలును, యాతని గుంపెడు
పిల్లల గని మందహాస
విలసితుడై రాముడపుడు

బ్రాహ్మణుడా!అదిగో దూ
రాన గానుపించుచున్న
అవులమందలవన్నియు
నావే మీకందునుండి
యెన్ని మీకు కావలెనో
యెన్నిటి నేనీవలెనో

తోచుట లేదందుచేత
మీచేదండమును విసరి
పారవేయుడది యెంతటి
దూరములో పడునొ అంత
దాక నున్న గోవులన్ని
దానమిత్తు మీకుననియె

ఉర్వీసురు డంతట తన
ఉత్తరీయమును గబగబ
కౌనునకు బిగించి చేతి
కర్రను గిరగిర ద్రిప్పుచు

విసరివేసి నాడపుడది
వేలకొలది ఆవులమం
దలదాటుచు సరయూనది
దాటిగట్టుకావల గల

పలుమందల దాటిపోయి
పడిపోయిన దచట మేయు
చుండిన ఆబోతు కాడ
చోద్యముగా జనులుచూడ?

హర్షాతిశయమున రాము
డతని కౌగిలించుకొనుచు
బ్రాహ్మణుడా! దాన మడుగ
బలపరీక్ష చేసితి నని
కోపపడకు నీశక్తిప్ర
తాపము ప్రకటము చేసితి

ఈఆవులె కాక నీకు
నింకేమైనను వలసిన
కోరుకొనుము నిత్తుననుచు
కూరిమితో రాముడనెను.

వేలకొలది ఆవులగొని
విప్రుడు సంతృప్తుడగుచు
ఇంకేమియు గోరకుండ
ఇనకులాబ్ధిసోముడైన

శ్రీరాముని దాతృచమ
త్కారంబుల శ్లాఘించుచు
చల్లగ దీవించుచు తన
సదనమ్మున కరగినాడు

**తండ్రితో వీడ్కోలు**

సీతాసౌమిత్రులతో
శ్రీరాముడు కడసారిగ
తండ్రికి వీడ్కోలు జెప్పి
దండక వెడలగ వచ్చెను

గ్రహణము పట్టిన సూర్యుని
కరణి దశరథాధీశుడు
వ్యాకుల పీడితుడై కడు
శోకించుచు గనుపించెను

కేలుమోడ్చి రాముడు సీ
తాలక్ష్మణ సమేతుడై
నడచివచ్చుటనుగని తడ
బడుచు లేచి పరుగెత్తుచు
రాముని జేరక ముందే
రాజేంద్రుడు పడిపోయెను

రామలక్ష్మణులు వెంటనె
రాజేంద్రుని లేవనెత్తి
పర్యంకముపైన జేర్చి
పరిశుశ్రూషలు సలిపిరి

కొంతవడికి మహారాజా
కింత స్పృహకు వచ్చినాడు
హా రామా యని గద్గద
మదర ఏడ్వ సాగినాడు

అంతరాము డవనీశుని
ఆశ్వాసించుచు తనకిక
అడవికి వెళ్లుట కొఱకై
అనుమతి నిమ్మని అడిగెను.

తనవెంటను సీతాల
క్ష్మణులు వచ్చుచున్నారని
వారి ననుమతించు డనుచు
కోరెనంత మహారాజు

నాయన రామా! ఈ కై
కేయికి నేమాటయిచ్చి

కట్టుబడితి కాని నీవు
కట్టుబడగ లేదుగదా!
బలప్రయోగమున నయోధ్య
గెలిచి రాజ్యమేలుకొనుము
అడవికి నీవేగ నేల
అనినంతనె రామమూర్తి

నాన్నగారు! రాజ్యకాంక్ష
నాకేమాత్రమును లేదు
నేవనవాసము చేసెద
నీమాటను నిలబెట్టెద

వెనువెంటనె భరతుని పిలి
పించి పిన్నికిచ్చినట్టి
మాటను చెల్లించుకొనుడు!
మహారాజ మనవి వినుడు!

ఆలస్యము చేయరాదు
అడవికిపుడె ప్రయాణమై
వెళ్లుచుంటి మిక మము దీ
వించి పంపు డాదరమున

అనురాముని మాటలువిని
ఆపలేని దుఃఖంబున
అవనీనాథుడు కొడుకును
కవుగిలించుకొని యెడ్చెను

అక్కడున్న ఆడవార
లందరు గొల్లున యేడ్చిరి
కైక తప్ప అంతఃపుర
కాంతలందరును యేడ్చిరి

అంతఃపురమంత రోద
నాక్రందనతో నిండెను

అయోధ్యయంతయును విషా
దాలాపనతో నిండెను.

**సుమంత్రుడు**

అంత సుమంత్రుని కన్నుల
నశ్రువులలయి మెదిలెను
అతనిగుండె జలజలమని
ఆర్ద్రమగుచు ద్రవియించెను

మరుక్షణమె మహారాజు
దురవస్థకు కారణమగు
కైకేయీ దౌష్ట్యానికి
కన్నులనిప్పులుచెరగుచు

ఆమెవైపు దిరిగి అగ్ర
హావేశముతో పటపట
పండ్లుగీటి తీక్ష్ణమైన
వాగ్బాణములను గ్రుమ్మెను!

ఓరాణీ! నీయంతటి
క్రూరురాలు దుష్టురాలు
ఏయుగాన ఏజగాన
ఏనాడును లేదులేదు

కోటిమంది కొడుకులున్న
బోటికి పతియే దైవము
కొడుకుకొరకు పతిదేవుని
గుండె పగులగొట్టినావు

పతిదేవుని వంచించిన
పాపిష్టివి, వంశనాశ
నివి, నీరాజ్యములో మే
మెవరముండ నొల్లము నీ
కొడుకు తోడ రాజ్యమేలు
కొనుము మేము రామునితో

అడవి కేగెదము నిర్జన
మైన దేశ మేలుకొనుము

వేముకు తేనెలు కారని
విధము నీకు నీతల్లి గు
ణాలు గాక యెట్లు సద్గు
ణాలుగల్గు దుష్టురాలి
కేలాగు సుపుత్రి పుట్టు
ఇకవిను నీతల్లిచరిత

తిర్యగ్జంతువుల భాష
తెలిసిన మీతండ్రి పాన్పు
పైనుండగ చీమల సం
భాషణవిని నవ్వినాడు

తనను వెక్కిరించెననుచు
తలచిన నీతల్లి అపుడు
నవ్వితి రిట్లేలని మీ
నాయనతో ప్రశ్నించెను

అందుకు మీనాన్న యది ర
హస్యవిషయ మది చెప్పిన
తనకు చావు సంభవించు
నని దానిని చెప్పననెను

నీవు చచ్చినా సరియే
నీనవ్వుకు కారణమ్ము
చెప్పవలయునని హఠమ్ము
చేసెను నిను గన్నతల్లి

నీజనకుడు నీతల్లిని
నీచురాలిగా నెంచెను
పట్టుదలకు పతినిజంపు
పాపిష్ఠిగ భావించెను

వెంటనె నీతల్లి నతడు
వెడలగొట్టి విడనాడెను
తల్లిగుణమె కూతుళ్లకు
తగవచ్చునటంద్రు జనులు

తల్లికి తగకూతురువని
తలపించితివమ్మ నీవు
నీచరిత్ర తెలియనిదా!
నీచుల లోక మెరుంగదా!

ఇంకనైన బుద్ధిగలిగి
మంకుతనము మాని మహా
రాజును నిర్బంధించక
రాజభోగములపొందుము

ప్రజారంజకుడు సర్వ
ప్రాణిరక్షకుడు వంశ
జ్యేష్ఠుని కారడవుల పాల్
జేసి సంప్రదాయ విరు
ద్ధముగ చిన్నవానికి ప
ట్టము గట్టుట ధర్మమగున?

జ్యేష్ఠుండగు రాముని కభి
షేకము గావించెద నని
మహాసభామధ్యమ్మున
మహారాజు ప్రకటించెను

అతనిమాట అబద్ధమగు
నట్లు నీవుచేయవలదు
పతి కయిష్టమయిన పనిని
పట్టుబట్టి చేయవలదు

అపఖ్యాతివచ్చును నీ
కమ్మా! కైకమ్మా! శ్రీ

రాముని యెడబాసి మహా
రాజు బ్రతుకలేడమ్మా!

జ్యేష్ఠసుతుని రాముని కభి
షేకము గావించి రాజు
వనికేగును నీవతనిని
అనుసరించు టది ధర్మము

కాని రాముని వని కంపి
కట్టుకొన్న వానిని దుః
ఖమున ముంచి చంపజూచు
కర్కశ రాక్షసివి కాకు

కైకమ్మా! శ్రీరాముడు
కానల కేగుట ధర్మము
కాదు మనసుమార్చుకొనుము
కార్పణ్యముతగదు వినుము

అని సుమంత్ర మంత్రివరుడు
అనేక విధముల జెప్పిన
కాసంతేని చలించక
కైక మౌనముగ నిలిచెను

ఆమె రాతిగుండె కరుగ
దయ్యె ఆమె ముఖములోన
క్రూరవర్ణమావంతయు
మారదయ్యె నేమనవలె

కైకేయి ప్రసన్నురాలు
గాకుండుట జూచి రాజు
కలతజెంది తన వరముల
తలచుకొనుచు నిట్టూర్చెను.

గడ్డి కప్పి నట్టి నుయ్యి
గజమెరుగక పడిన భంగి

కోర్కెలిట్టివని తెలియక
గుడ్డిగ చెల్లించెదనని
ముందుగ మాటిచ్చి రాజు
ముప్పులోన బడిపోయెను

వెదురుకు పూసిన వువ్వే
వెదురును కాల్చిన కైవడి
తానిచ్చిన మాట తనకు
హానిహేతువై పోయెను

ఏ దారిని గానక రా
జిట్లనియె సుమంత్రునితో
సుమంత్ర రాముడడవిలో
సుఖముగ జీవించుటకై

వానివెంట ధనరాశుల
వర్తకులను నర్తకులను
పండితులను గాయకులను
పరిచారిక సమూహమును
అవసరమగు వస్తుసముచ
యాదులవన్నియు పంపుము

రాముడడవి భద్రతతో
క్షేమముగా నుండుటకై
వానివెంట చతుర్విధము
లైన సైన్యముల పంపుము

ప్రభువిట్లని చెప్పగవిని
భయపడి డగ్గుత్తికతో
ఏమేమీ రాజా! మీ
రిచ్చు వరాలివియేనా!

జనములేక ధనములేక
సైన్యాదులులేక శూన్య

మైన సురాభాండము విధ
మగు రాజ్యము మాకిత్తువ!

అనుచు కైక సిగ్గువిడిచి
అన్నది అపు డవనీశుడు
ఓసీ! నాగుండెనిట్లు
కోసినన్ను పీఠింతువ?

వరములడుగు నీవపుడి
క్కరణి ధనాదులను పంప
వలదని అడిగితివా! నీ
వంచనకొక హద్దున్నద!

అని దశరథుడన్నంతనె
తనయభీష్టమునకు చేటు
కలిగెననుచు కోపముతో
కైక రాజుతో నిట్లనె

మునుతన వంశమున సగరు
డనెడి రాజు తనజ్యేష్ఠుని
అసమంజుని వనికంపెను
అపుడురాజు అతనివెంట
ధనసేనాదులపంపెన!
తమరట్లే సేయవలద

**సిద్ధార్థుడు**

ఆమాటకు సిద్ధార్థుడు
అడ్డుతగిలి కైకేయీ!
అసమంజుడు దుష్టుడతడు
ఆడుకొనెడి పసిపిల్లల
సరయూనదిలోన ద్రోసి
సరదా పడుచుండువాడు

అట్టివానిపై రాజుకు
ఆరోపణ ప్రజలుసేయ
అసమంజుని నిర్ధనునిగ
అడవికంపె అవనీశుడు

రాముడు సుగుణాభిరాము
డేమి దోషమొనరించెను
నిర్దోషిని శిక్షించుట
నిక్కముగ అధర్మమగును

ఆ యధర్మ మట్లుండగ
అపవాదము నీకువచ్చు
అదియైనను కలుగకుండు
నట్లు చూచుకొనవలదా!

అని వృద్ధుడు సిద్ధార్థుడు
అన్నమాట లాలించిన
కైకలోన కఠినత్వము
కాసంతయు కరుగలేదు

అది గమనించిన దశరథు
డమిత దుఃఖమున బొగులుచు
ఓసీ! రాకాసి కైక!
ఈసిద్ధార్థుని మాటలు
వినవుగదా! ఇకనీభర
తుని రాజొనరించి రాజ్య
మేలు కొనుచు సుఖియించుము
ఇక నేనడవుల కేగెద

అని కైకను చీదరించు
కొనుచు మహారాజెంతయు
గుండెనొవ్వగా బలికిన
క్రూరురాలు వినదయ్యెను

అప్పుడు శ్రీరాముడు సి
ద్ధార్థుని మాటలకు బదులు

గానిట్లని పలికెను యెద
కరగి జాలువారునట్లు

గజమును త్యజియించిదాని
కట్టుత్రాడుకై తపించు
నట్లు నాకు ఈధనసే
నాదులేల? వలదువలదు

తాపిసి నైతిని నాకీ
ధనసేనాదులు దేనికి?
వల్కలాలు నాకిప్పుడు
వలయు వానిదెప్పింపుడు

అని శ్రీరాముడు పల్కిన
యంత కైక పొంగిపోయి
వెనువెంటనె లోని కరిగి
కొని తెచ్చెను వల్కలాలు.

రామలక్ష్మణులు వాటిని
లాఘువమున కట్టుకొనిరి
కాని సీత వాటినెట్లు
కట్టకొనెదెరో తెలియక

పతినిజేరి సిగ్గుపడుచు
పలికెనిట్లు నాథా వీ
టిని మును లెట్లు ధరింతురు
అని కన్నీర్వెట్టుకొనెను

సీతకట్టుకొన్న పట్టు
చీరపైననే రాముడు
నారచీర చుట్టబెట్టి
నాడప్పుడు అంతఃపుర
స్త్రీలందరు హాహా కా
రాలు చేసి గొల్లుమనిరి.

ఈసీతను నీవడవికి
తీసుకవెళ్లకు మనుచును

ముక్తకంఠమున రాముని
ముగ్ధలందరర్థించిరి

**వసిష్టుడు**

కులగురువప్పుడు చలించి
కోపించెను కైకేయిని
అవనీసుత కడవి కేగ
నవసరమే లేదనియెను

రామచంద్రునకు బదులుగ
రాజ్యమేల గలదు సీత
ఆమెకూడ అడవి కేగు
చోమేమందర మాయమ

వెంట వెళ్లగలమిక ఆ
పిదప భరతశత్రుఘ్నులు
వత్తురు నీవొక్కతెవే
పడియుండు మయోధ్యలోన

అని వసిష్టుడన్నంత మ
హారాజిట్లని పలికెను
ఓసి కైక శ్రీరాముని
ఒక్కనినే అడవికంపు

వరము కోరితివి కానీ
వైదేహిని వనికంపు మ
టంచు కోరలేదు కదా!
ఆమె అడవి కేగనేల?

సీతచేత నీవు నార
చీరలు కట్టించినావు
ఏమపకారము చేసిన
దామె నీకు చెప్పగదవె?

అని దశరథమహారాజు
ఆరాటముతో పలికెను

కాని భర్తకనురూపం
బైన వేషముననే ఆ
వరవర్ణిని జనకాత్మజ
వని కేగగ నిశ్చయించె

రాముడు సీతాలక్ష్మణ
సమేతుడై అడవికేగ
ప్రయాణమై వెడలుచుండ
ప్రజలందరు గొల్లుమనిరి.

రాముడంత తనతండ్రిని
సమీపించి జనకా! నా
తల్లి నావియోగముచే
తల్లడిల్లుచున్నది మీ
రామెను కనిపెట్టుకొనుచు
ఆదరమున చూడగలరు

అనుచు తల్లివైపు తిరిగి
అమ్మా! నాన్నను నీవెపు
డాదరమున చూడగలవు
అని వారల వీడుకొనెను

రామా! రామా!యని దశ
రథుడు ప్రలాపించుచు శ్రీ
రాముని వెంటను వెళ్లగ
ప్రయత్నించి తొట్రుపడెను

కౌసల్యా మహారాణి
కన్న కడుపు తీపుచేత
కొడుకు వెంట విలపించుచు
కొంత దూరమేగె నడచి

## అయోధ్యకు వీడ్కోలు

రాముడు సీతాలక్ష్మణ
సమేతుడై రథము మీద
అయోధ్యానగరము వీడి
అడవికేగ బయల్వెడలె

రాజాజ్ఞను తలదాలిచి
రథము సుమంత్రుడు ద్రోలెను
ప్రజలు దాని వెంటనంటి
ప్రవాహమటు వెడలినారు

రథమాపు సుమంత్రా! అని
ప్రార్థించిరి ప్రజలెల్లరు
వడిగా పోనిమ్మా! అని
అడిగె సుమంత్రుని రాముడు
రాజాజ్ఞాబద్ధుడగుట
రథమాపగ లేడాతడు!
అయిన ప్రజాప్రవాహాని
కడ్డుకొనగ వేడాతడు
రాజాజ్ఞను పాటించుట
రాజనీతి సుమంత్రునకు
కాని ప్రజాభీష్టమ్మును
కాదనగా రాదతనికి

లేగల కొఱకై గోవులు
వేగ పరుగు లెత్తునట్లు
రామాదుల రథమువెంట
ప్రజలు పరుగులెత్తినారు

రామాజ్ఞ ప్రకారమ్మా
రథము సుమంత్రుడు వడివడి
నడిపించుక పోసాగెను
నగర ప్రజ విలపించగ

కాలమేఘములతో పెను
గాలివీచు వేగమునకు
కదలిసంచలించునట్లు
కళవళించె పురమంతయు

అయ్యో! రామాభిషేక
మాగిపోయినది మనకిక
ఎవరుదిక్కు? ఎవరుమొక్కు?
ఎవరురక్ష? ఎవరుదక్ష?

పరులసుఖమె తనసుఖముగ
పరుల దుఃఖమే తనదుః
ఖమ్మొగ భావించువాడు
కమ్మని మనసున్నవాడు

సమహితత్వమెరిగి సర్వ
జనులకు ప్రియమైన వాడు
రాము డడవి కేగుచుండె
రక్షకు డెవరింక మనకు

అని అయోధ్యపురవాసులు
అయ్యో అని దుఃఖించిరి
రాముడులేని యయోధ్య ని
రాధారంబైపోయెను

**అయ్యో! అయోధ్య**

అయ్యో! రామయ్యలేని
ఆ అయోధ్య తిలకము లే
నట్టి మహిళ ముఖ మండల
మట్టుల వెలవెల బోయెను

పురమందు గృహస్తులెవరు
పొయ్యి రాజవేయ లేదు
పౌరుల నిరసనతో తమ
పనులకెవరు వెళ్లలేదు

పశువులు సహితము తోచక
ప్రతిమలవలె నిలచిపోయి
కంటనీరుపెట్టి గ్రాస
కబళమైన ముట్టలేదు

రాముడు సీతాలక్ష్మణ
సమేతుడై రథముమీద
వనికేగుట మహారాజు
గని మూర్ఛితుడై పోయెను

ఒకరెక్కను కౌసల్య మ
రొక చెయి కైకేయి పట్టు
కొని లేవగనెత్త రాజు
కినుక తోడకైకనుగని

కైకా! వంచకి! నన్నిక
తాకకు, నాకంటపడక
దూరముగా వెళ్లిపొమ్మ
దుష్టురాల! యని కసిరెను

రాజేంద్రుడు కౌసల్యా
రాణిభుజము పట్టుకొనెను
ఆమెచేయి యతని నడుము
కాసరగా చుట్టకొనెను

అపు డంతః పురస్త్రీలు
ఆదంపతులను దోడ్కొని
కౌసల్యామహారాణి
వాసమునకు వెళ్లినారు.

పాన్పుపై పరుండిరాజు
పరమ దుఃఖమును పొందుచు
కౌసల్యా! నీ కొడుకును
కారడవికి పంపితినని
నాపై కోపమును వీడి
నను క్షమించు మనిపలికెను

పూలరంగు సొగసుజూచి
మోసపోయి మామిడి వృ
క్షమును నరికి మోదుగు వృ
క్షమును నాటి పెంచుకొంటి

కౌసల్యా! శ్రీరాముని
గన్నతల్లి! నిన్ననే ని
రాదరించి కైకేయిని
ఆదరించిమోసపోతి

అని పరిపరివిధముల వసు
ధాధీశుడు పశ్చాత్తా
పమునుజెంది కౌసల్యను
క్షమించుమని ప్రార్థించెను

పరితపించురాజు సమీ
పానగూరుచుండి రాణి
నిట్టూర్పులు పుచ్చుచు క
న్నీరొలుకగ దుఃఖంచెను

కన్నులలో మెదిలెడి తన
కన్నయ్యను దలచుకొనుచు
రోదించెడి కౌలస్యను
ఓదార్చెను సతిసుమిత్ర

మరలివచ్చు బంధు సఖులు
మరిదూరము సాగనంప
రాదనుటెరిగియు నాగక
రథము వెంటబడిరి ప్రజలు

రథవేగ ధ్వనివిని తి
ర్యగ్జంతువు లచలములై
రథమాపుట కశక్తలై
ప్రతిమలట్టు లగుపడినవి

కనుల నశ్రువులు గమ్మగ
కనపడ కుండుట నాగక
పరుగెత్తుచునే యుండిరి
ప్రజలు రథముననుసరించి

రథముడిగ్గి రాముడు ప్రజ
లార! అయోధ్యకు వెళ్లుడు
భరతునిపై ప్రేమగౌర
వాలు చూపుడని కోరెను

అయిన వారు వినకుండగ
ఆరాముని రథము వెనుక
పరుగెత్తుచు రాసాగిరి
ప్రజలెంతటి రాగమయులు!

ఆదరమున ప్రజలను నో
దార్చి పిదప పొమ్మని య
న్నట్లుగ ఆ తమసానది
అడ్డువచ్చె రామయ్యకు

**తమసానదీ తీరం**
**(వనవాసంలో మొదటిరేయి)**

అపుడు ప్రొద్దు గూకవచ్చె
అచట సుమంత్రుడు రథమును
నిలిపి అశ్వములను విప్పి
నీళ్లుమేత వాటికిడెను

అది తమసానదీతీర
మచటారాతిరి గడిచెను
అది అరణ్య వాసములో
మొదటిరేయియైపోయెను
సుమంత్ర లక్ష్మణులు సీతా

రాములకై ఆకులతో
శయ్యనేరు పరుచవారు
శయనించిరి ఆరాతిరి

రాముని సుగుణాలగూర్చి
రాతిరంత నిదురవోక
సుమంత్రలక్ష్మణులు మేల్కొని
తమకముతో చెప్పుకొనిరి

రాతిరింక మిగిలియుండ
రాముడు మేల్కొని రథమును
సిద్ధము గావించుమనుచు
చెప్పె సుమంత్రునితోడను

పౌరులింక నిదురనుండ
తేరునెక్కి రాముడు సీ
తాలక్ష్మణ సమేతుడై
తమసానది దాటినాడు

ప్రజలు తమసఒడ్డుమీద
వళ్లుమరచి నిద్దురించి
తెలవారిన పిదపలేచి
తేరును గానక వగచిరి

ఎంత వెదకినను వారికి
సుంతయేని రథము జాడ
అగుపించదు తిరిగి అయో
ధ్యకువచ్చిరి దుఃఖించుచు

రామునివెంటను తీసుక
రానందుకు భర్తలపై
అలిగి తిట్టిపోసినారు
ఆడవాండ్రయోధ్యలోన

చంద్రుడు లేనట్టిరేయి
చందమ్మున రాముడు లే
నట్టి అయోధ్యానగరము
దంతయు వెలవెల బోయెను

ఆరోజెవ్వరు బ్రాహ్మణు
లాహ్నికాలు చేయలేదు
తల్లులు తమమగశిశువుల
దగ్గర రానీయలేదు

పురములోన ఎవరింటను
పొయ్యి రాజ వేయలేదు
మూసినట్టి దుకాణాలు
మూసియుండె తెరువలేదు

అయ్యోఅయ్యో అయోధ్య
ఆరాముని యెడబాటుకు
ఎంతగాను తల్లడిల్లి
ఇదియైఅదియైపోయెను!

**రెండవరోజుప్రయాణం**

ఇంకను తెలవారక ముం
దే రాముని రథమది వడి
దవ్వులు దాటుచు ముందుకు
తరలి వెడలి పోతున్నది

వేదశ్రుతి గోమతి ఇ
త్యాదినదులు దాటుచు కో
సలదేశపు సరిహద్దును
సమీపించినది రథమది

అపుడు సుమంత్రుడు రాముని
యాజ్ఞచేత రథమాపెను

అంత టయోధ్యాపురమున
కభిముఖుడై శ్రీరాముడు

కరములు మోడిచి భక్తిగ
కైమోడ్పులు ఘటియించుచు
తన పూర్వీకుల గురించి
జనకజతో నిట్లనియెను

(మునుపుమహావిష్ణువు భా
నునకు యోగ మొసగెనం(గీత)
అదియెట్లన వినవే చె
ప్పెదసీతా! విష్ణువు తా

త్వష్టపదవి నున్నప్పుడు
తనకూతురు సంజ్ఞనిడి వి
వాహమొనర్చెడివేళను
వరదక్షిణగా నిచ్చెను

మహావిష్ణువునకే జా
మాత వివస్వంతుడుమన
మూలపురుషు డతనికి కై
మోడ్పులతో ప్రణమిలుదము

భాస్కరునకు సంజ్ఞయందు
ప్రభవించిన వైవస్వత
మనువను మహనీయు డయో
ధ్యను నిర్మించెను పూర్వము.

ఆమనువే తనదు జ్యేష్ఠ
కుమారుడగు ఇక్ష్వాకున
కీకోసల సామ్రాజ్యము
నేలుకొనగ నిచ్చినాడు)

త్యాగధనులు ధర్మరతులు
దక్షతతో పాలించిన

ఇక్ష్వాకుల దలచు కొనుచు
చక్షులశ్రువులు నిండగ

ఆ ఇక్ష్వాకుల పాలిత
మగు అయోధ్య జన్మభూమి
దాని నిపుడు వీడుచుంటి
జానకి! నాదౌర్భాగ్యము

అనుచీవిధి జన్మభూమి
యగు నయోధ్య కభివాదము
లాచరించి రాముడయో
ధ్యను వీడెను ధుఃఖంచుచు.

# తృతీయాశ్వాసము

## గంగానది

అల్లదిగో! గంగానది
అలలహస్తములనుచాచి
సగరవంశజుని రాముని
స్వాగతించ సమీపించె

శిలలమీద ఆ గంగా
జలధారలు పడుచుండగ
ప్రౌఢాంగన చేతులు చ
ప్పట్లు చరచు నట్లున్నది

రాళ్లమీద బడుజలధా
రలచే కల్గిన శబ్దము
లట్టహాస మట్లు దిక్కు
లన్ని పిక్కటిల్ల నిండె.

విరజిమ్మెడు తెల్లనైన
నురుగులు చిరునవ్వులుగా
ఎత్తునుండి క్రిందకు ప్రవ
హించుధార తలజడగా

విమలోత్పలములు కనులుగ
కమలములవి కరములుగా
మంగళోదకాలు మెరయు
మణిభూషణములు గాగా

సుడులుదిరుగుచును గుంతలు
వడుచోటుది నాభి గాగ
ఒకచోసువిశాలములై
ఒకచో నున్నతములునై

సైకత శిఖరములు కటి కు
చంబులనగ, వాటి నడుమ
సన్నని వాహిని కౌనుగ
చెన్నలరగ గంగానది
సుందరాంగనామణివలె
శోభిల్లుచు నున్నదహహా!

గంగను కనువిందుగ గని
కదలుచుండ శృంగిభేర
పురము సమీపించె నపుడు
పొద్దు గూక వచ్చుచుండె

అదిగో ఆసమీపాన
అందమైన గారచెట్టు
పూలు చిగుళ్లును గలదై
ముచ్చట గొల్పుచు నున్నది

అచటికి బోనిమ్ముతేరు
నచటినుండి ఈగంగను
బాగుగ చూడగ వచ్చును
బసయు నచట చేయుతగును

అని రాముడు చెప్పగ ల
క్ష్మణసుమంత్రులిరువురు తమ

అంగీకారము దెలిపిరి
అచటికి రథమును ద్రోలిరి

## గుహుడు

శ్రీరాముని రాక దెలిసి
చేతము పొంగార గుహుడు
అమాత్యసేనా పరివా
రముతో నెదురుగ వచ్చెను

అతడు రామవిభునకుస్నే
హితుడు కింకరుడు భక్తుడు
రామదర్శనార్థ మతడు
స్వామిభక్తితో వచ్చెను

అతని కెదురుకోలుచెప్ప
అనుజునితో శ్రీరాముడు
గుండెనిండ కూర్మినింపి
గుహుని కెదురుగా వచ్చెను

అంత గుహుడు రాముని గా
ఢాలింగన మొనరించెను
స్వాగత వచనముల రామ
స్వామిని సంభోధించుచు

హేప్రభువర! మీకయోధ్య
యెట్టిదొ నాకీపట్టణ
మట్టిది మమ్ములను మీర
లాజ్ఞాపించగ వలయును

అనుచు అర్ఘ్యపాద్యంబుల
నర్చించెను, భక్ష్యభోజ్య
లేహ్యాదుల నర్చించెను,
హృదయాంజలి ఘటియించెను

గుహు డప్పుడు శ్రీరామా !
గహన వాస మిచ్చటనే
నెరవేరుచు కొనుడటంచు
నిండుభక్తితో పలికెను.

గుండెనిండ ప్రేమనింపి
కొలుచు గుహుని రాముడుగా
ఢాలింగన మొనరించెను
ఆనందముతోపొంగెను

హితుడా! నీఆదరమున
కెంతయు సంతృప్తుడ నై
తిని కానిపు డీకాన్కల
గొననర్హత లేదునాకు

పిత్రాజ్ఞను దలదాలిచి
విపినములను మునులభంగి
గడుప వలెను గానయిపుడు
కాన్కల గ్రహియింపరాదు

నేనిప్పుడు వనవాసిని
మౌనిజీవనము గడుపుదు
రాజును నేకాను నాకు
రాజగౌరవములు వలదు

శృంగిభేరి పురములో వ
సించుట వనవాసము కా
దని గుహునకు నచ్చచెప్పి
ఆశ్వాసించెను రాముడు

అశ్వములకు మేతయొసగు
డంతచాలునివి దశరథ
మహారాజు విక నాకే
మర్యాదలు వలదు వలదు

అశ్వాలకు మేత యొసగ
ఆజ్ఞలిచ్చినాడు గుహుడు
అనుజుడు గంగాజలముల
గొనితేగా రాము డపుడు

సాయంసంధ్యోపాసన
సలిపి పిదప గంగాజల
మాహారముగాగ్రైకొని
ఆరాతిరి నిదురించెను.

## గంగానదీ తీరం

**(వనవాసంలో రెండవనాటిరేయి)**

అదిరెండవరేయి వారి
అరణ్యవాసములోనది
గంగానదితట మచ్చట
గడిపినారలారాతిరి

కనులెంతగ మూసికొనిన
కాసంతయు కునుకురాదు
ఆరాతిరి యెంతకు తెల
వారదయ్యె రామయ్యకు

సుఖము లనుభవించినట్టి
సుకుమారుడు శ్రీరాముడు
నేలపై పరుండి యెట్లు
నిదురవోవు రాచబిడ్డ

(భయద సర్పశయ్యపైన
పవళించెడి స్వామికి ఈ
కటికనేలపైపరుండ
కష్టమదేమాత్రమగునొ!)

రాతిరంత నిదురవోక
సీతారాముల కాపల
గాయుచుండు సౌమిత్రిని
గని గుహుడిట్లని పలికెను

అయ్యా!లక్ష్మణదేవా!
అలసిపోయినారు మీరు
శయనించుడు మేమీ ర
క్షణకార్యము చూడగలము

ఆమాటకు లక్ష్మణు డి
ట్లని పలికెను గుహుడా నీ
వుండగ మాకెట్టి భయం
బుండదు నిశ్శంశయముగ

మహారాజు జ్యేష్టసుతుడు
మాకగ్రజు డగు రాముడు
జనకజతో నేల మీద
శయనించుచునుంటజూచి

నాకు నిద్ర పట్టునెట్లు?
నాకు సుఖంబెట్లుగలుగు?
మాకగ్రజు డీవిధమ్ము
గాకష్టము లొందుచుండ

దశరథరాజేంద్రున క
త్యంతప్రీతిపాత్రుడితడు
ఇతని వియోగమునకు రా
జేంద్రుడు జీవించలేడు

శత్రుఘ్నుని జూచుకొనుచు
శాంతిలి మాతల్లి బ్రతుక
వచ్చుకాని రాముని విడి
బ్రతుకజాలదతనితల్లి

అని వ్యాకుల పడులక్ష్మణు
గనిగుహుడార్తిని జెందెను
జ్వరపీడిత గజముభంగి
చక్షుల నశ్రులు గార్చెను

సూర్యోదయ మగుచున్నది
శుకపికములు కూయుచుండె
త్వరగా మనమీగంగను
దాటి వెళ్లి పోవలయును

అని రాముడు నిద్ర లేచి
అనుజునితో పలికినంత
ఆసంగతి గుహుని తోడ
అతడెరిగించెను వెంటనె

చుక్కాని అమర్చినట్టి
చక్కనినావను రేవును
తెడ్డువేసి దాటించగ
తెప్పించెను గుహుడప్పుడు

నమస్కారమయ్యా! మా
రామయ్యా!మీకొరకై
నావ వచ్చియున్నది ఆ
జ్ఞాపించుడు నన్నింకను

గుహుని సమాదరణకు తన
గుండె పొంగిపోగా రా
ముడు గాఢపరిష్వంగం
బున నాతని జేర్చుకొనెను.

## సుమంత్రుని పరితాపం

అపుడు సమంత్రుడు ముందున
కరుదెంచి నమస్కరించి
యేమియాజ్ఞ ఇచ్చెదరని
రాముని సంప్రార్థించెను

సుమంత్రమంత్రివర! మీకు
శుభమగుతను-మీరయోధ్య
కేగవలయు మహారాజు
నేమరకను చూడవలయు

నా వియోగ దుఃఖంబున
నలిగిపోవు మాతండ్రిని
కనిపెట్టుక నుండవలయు
కలతజెంద నీయవలదు

ఎన్నడేని యింత దుఃఖ
మెరుగని మాతండ్రి నావి
యోగముచే దుఃఖించుచు
నుండు నతని నోదార్చుడు

సంతప్తుండై రాముడు
జాలిగొలుపు నట్లాడగ
సుమంత్రుడంత పట్టరాని
శోకంబున బావురుమనె

ముఖమంతయునశ్రులతో
ముసురుకొనగ గంగాజల
ముల ముఖమును ప్రక్షాళన
మొనరించుక శుచియయ్యెను

రామ ప్రభుభృత్యులపై
ప్రేమ మెండుకదా మీకు
మీభృత్యుడనైన నన్ను
మీవెంటను రానీయుడు
మీసేవలలోగడిపెద
మీకురథము తోలుచుందు
మీవనవాసములో మీ
తోవసింతు ననుమతిండు

ఎక్కడ మీరుందురొ నే
నక్కడనేయుండగలను
మీరులేక దేవలోక
మైన నందునుండనొల్ల

ననుచుసుమంత్రుడు గద్గద
మదర కంటనీరుపెట్టు
కొనిరామునితో పలికెను
గుండె తరిగి పోవునట్లు

అంతరాముడార్తుడగుచు
నతని భజముతట్టిపలికె
ఓసచివోత్తమా! మీ ర
యోధ్యకు వెళ్లితెనే మా
కైకమ్మకు నమ్మకమగు
కానకు మేమేగితిమని

అట్లగుటను మీరవశ్య
మయోధ్యజేరుకొనవలయు
భరతున కనుకూలముగా
పాలనలో మెలగ వలయు

తల్లులు మువ్వురకును మా
దండంబులు చెప్పవలయు
భరతుని పిలిపించి రాజ్య
పట్టము గట్టించ వలయు

మాతండ్రికి సాష్టాంగ న
మస్కారములని చెప్పుడు
వనవాసము చేత మేము
వగచుట లేదని చెప్పుడు

ఇట్లు సుమంత్రాఖ్యునితో
ఇంపానగర బల్కి రాము
డతని నయోధ్యకు పొమ్మని
ఆదరమున నర్థించెను

గుహు సుమంత్ర వరులకు వీ
డ్కోలు చెప్పి సీతా ల

క్ష్మణులగూడి నావ నెక్కి
గంగను దాటెను రాముడు

**సీతగంగకు మ్రొక్కుకొనుట**

నదీమధ్య భాగమునకు
నావ పోయి నంతటనే
చేతులు జోడించి యిట్లు
సీత భక్తితో పలికెను

తల్లీ! గంగాదేవీ!
దశరథపుత్రుడు రాముడు
వనవాసము పూర్తిచేసి
కొనునట్లుగ దీవించుము

ఏ విఘ్నము కలుగకుండ
ఈ రఘుసోదరులునేను
మరల తిరిగి వచ్చునట్లు
మాతా! మము దయజూడుము

మా అరణ్య వాసదీక్ష
మంచిగ నెరవేరె నేని
బహువిధముల నీవుతుష్టి
పడునట్లుగ పూజింతును

వనవాసము ముగిసి లక్ష్మ
ణునితోనాతో రాముడు
భద్రముగా మరలివచ్చు
పగిదిమమ్ము రక్షింపుము

అని జానకి గంగాదే
విని నివ్విధి ప్రార్థించుచు
నుండ వేగముగ నావలి
ఒడ్డు జేరుకొనెను నావ

**రక్షణ కార్యం తలచుట**

నావనుదిగి ఆముప్పురు
నడువ సాగి రడవిలోన
అపుడు రాము డనుజునితో
ననియె నిట్లు ఆదుర్దగ

(శ్లో॥ అన్యోన్యస్నేహనోరక్షా
కర్తవ్యా పురుషర్షభ!
నహితావదతిక్రాన్తా
సుకరా కాచనక్రియా) 52వ.స.96వ.శ్లో

సౌమిత్రీ! మనమిక ర
క్షణకార్యము చూడవలయు
ఎరుగని ఈఅడవిని మన
కేమి జరుగునో తెలియదు

కడచిపోయినాక చేయ
గలిగినదేమియునుండదు
అప్రమత్తతగ నుండుట
అవశ్యముకద! మన కిప్పుడు

నీవు ముందు నడువ వలయు
నీవెనుకను సీతనడుచు
మీయిరువుర రక్షించుచు
మీవెనుకను నేనునడుతు

రాముడు చెప్పిన చొప్పున
లక్ష్మణుడేగెను ముందుగ
సీతయతని ననుసరించ
శ్రీరాముడు వారిరువుర
ననుక్షణము రక్షించుచు
చనుదెంచెను సీతవెనుక

**ఆధ్యాత్మికం**

(లక్ష్మణుడు జీవాత్మ
లలన సీతమ దేహ
మైయొప్ప శ్రీరాము
డలరె పరమాత్మగా

కాన జీవుడు ముందు
గా పోయి దేహమును
తన ననుసరించునటు
లొనరించు చున్నచో

రక్షకుడు పరమాత్మ
రక్షించు నిరువురను
అటుగాక దేహమును
అనుసరించిన యెడల
ఇరువురకు చేటు చే
కురును రక్షణ లేక

ఇందు ప్రణవమున్నది తను
వందున ఈతత్వత్రయ
మలరుట, తనువునుగాచుట
ఆవశ్యకమగుచున్నది)

ఆగట్టున నిలిచి సుమం
త్రాఖ్యుడుకడుదుఃఖితుడై
అమువ్వురు గంగానది
కద్దరి జేరగ బోగా
కన్నార్పక చూచి చూచి
కడకు వారు గట్టుజేరి
నావను దిగి నడచి సాగి
పోవుచు పోవుచు కనుమరు
గై పోవుటచే జలజల
కంటనీరు గార్చినాడు!
బరువుగుండెతో అయోధ్య
కరుగ తేరు ద్రోలినాడు!

అన్నదమ్ములిరువురు వే
టాడివరాహాది మృగ
మ్ములను జంపితెచ్చి వాటి
పలలము పక్వమ్మొనర్చి
వారు ముగ్గురారగించి
నారు క్షుదాతురత దీర

## వత్స దేశ ప్రాంతం

### (వనవాసంలో 3వ నాటి రేయి)

వత్సదేశప్రాంతమ్మది
వచ్చెనంత ప్రొద్దువాలి
సంధ్యాసమయమ్మాయెను
సంధ్యవార్చుకొనిరివారు

అచట పెద్దచెట్టు క్రింద
ఆ రాతిరి గడుప నెంచి
ఆకులతో కూర్చిన శ
య్యలపై విశ్రాంతిగొనిరి

అది అరణ్య వాసములో
ఆముప్వురు గడిపినట్టి
మూడవ రాతిరి ఇంకను
ముందున్నవి రాత్రులెన్నో!

### హెచ్చరిక (గతిమార్పు)

అపుడు లక్ష్మణు జూచి
అనియె రాఘవు డిట్లు
సౌమిత్రి మన మిపుడు
జనులు వసియించు ప్రాం
తము వీడి వచ్చితిమి
సుమంత్రుడును లేడిపుడు

మనకు వనవాసమం
దున నొంటిరిగ గడుపు

రాత్రులందున మొదటి
రాత్రి యయ్యెను చూడు!
ఇకనుండి ప్రతిరాత్రి మనము!
ఏమరక నుండవలె వినుము!

మనమంచి చెడ్డలను
మనమె చూచుకొనంగ
వలసియుండినదైన
వైదేహి తన భద్ర
తను జూచుకొనలేదు
కనుకమనమే ఆమె
బాగోగులను జూడవలయు!
జాగ్రత్త గానుండవలయు!

## తల్లిదండ్రులను తలచు కొని దుఃఖించు రాముడు

లక్ష్మణా! ఇపుడు దశ
రథమహారాజునకు
పరితాపమున నిదుర
పట్టకుండును కాని
కైకేయి మాత తన
కోర్కె నెరవేర్చు కొ
న్నది గాన ఆనంద
నదిని దేలుచునుండు
తనపతిని దుఃఖమున ముంచి!
తనసుఖమె ముఖ్యమనియెంచి!

కామవశుడైరాజు
కైకేయి చేజిక్కి
యున్నాడు దుఃఖించు
చున్నాడు ధర్మార్థ
ములకన్న కామమే
బలమైన దనిపించు
దశరథునివలె కామ
వశుడు వాడెవడైన
కడగండ్లపాలగుట నిజము!
కామమెంతటి హానికరము!

కైకేయి తనకిపుడు
కల్గినట్టి సుఖాతి
శయ మదముచేత కౌ
సల్యా సుమిత్రలను
భాధించుచుండును అ
వశ్యమిక నీవ యో
ధ్యకు వేకువనె లేచి
త్వరగ వెళ్లుముర మన
తల్లులకు నీవండ
దండగా నుండగా
నేనొక్కడనె సీత తోడ!
కానలకు బోదుచిన్నోడ!

నను గారవాన బెం
చినది నాతల్లి నా
వలన శుశ్రూ లను
బడయ వలసిన సమయ
మున నేను ఆ దయా
ధునిని విడి వచ్చితిని
అకటకట నేనేమి సేతు!
అమ్మదుస్థితి కెట్లుసైతు!

నేను నాతల్లితో
కానలకు బోదునని
చెప్ప నపుడామె పెం
చిన గోరువంక-ఓ
చిలుకా విరోధి యగు
చెనటి కైకేయి కా
లును, కటిక్కిన కొరుకు
మనెను గోర్వంక కున్నంత!
నెనరు లేదాయె నాకింత!

తమ్ముడా! జన్మాంత
రమ్ములో మాయమ్మ
యేతల్లి కొడుకులకొ
ఎడబాటు చేసియుం
డును కాక నిపుడామె
తన కొడుకు నెడబాసి
తల్లడిలుచుండు నా
తల్లిదుఃఖమ్మునకు
అకట! నేహేతువైపోతి!
ఆమె దుఃఖముదీర్చనైతి!

తల్లిదండ్రులనిట్లు
తలచుకొని తలచుకొని
ముఖమంత కన్నీళ్లు
ముసరుకొన దుఃఖమున
మాట పెగలక ఆగిపోయె!
మమతతోయెదనిండిపోయె!

ఓ లక్ష్మణా! నేన
యోధ్యనే కాదు ఈ
భూమినంతయు బాణ
ములనాక్రమించగల
నైనను అధర్మభయ
మదియు, పరలోకభయ
మదియు నన్నడ్డుకొనె
అట్లగుట నేనిట్లు
అభిషేకమును మాని
అడవులకు వచ్చితిని
అని అశ్రువులుగార్చు
చును మాటలాడ జా
లక రాఘవుడు గద్గ
దికమదర నూర్కుండె
ధర్మవర్తనున కదియెట్లు!
తటస్థిలు చుండునిక్కట్లు!

మంటలారిన అగ్ని
మాడ్కియును, అలలాగి
పోయినట్టి సముద్ర
మును పోల్కి రాఘువుడు
అగుపించె లక్ష్మణునకపుడు!
అన్న నోదార్చె నిట్లతడు!

## లక్ష్మణుని ఓదార్పు

అన్నయా! ఇపు డయో
ధ్యాపట్టణము సుధా
కరుడు లేనటువంటి
కారు చీకటి రాత్రి
వలెనుండునిది వాస్త
వము నీవు లేని ఆ
పట్టణము పతి లేని
పత్ని వలెనుండు!
దినకరుడులేనట్టి
దినము వలెనుండు!

అయిన నీవిపుడిట్లు
ఆర్తి జెందుట వలన

లాభమింతయు కాన
రాదు నీవిక నన్ను
నినువీడి పొమ్మనకు
నీటిబాసిన చేప
మనజాల లేనట్లు
క్షణమాత్రమేనియును
నిన్నువిడి నేబ్రతుక లేను!
నిక్కమిది నినువీడి పోను!

కన్నతల్లిని తలచు
కొన్నంత ఎదనొచ్చి
రాము డడలుచునుండ
లక్ష్మణుండోదార్చ
ఆరాత్రి యెట్లెట్లొ గడిచె!
అంత తెలవారగావచ్చె!

ఈ రీతిగా రాము
డా రాత్రి యంతయును
తల్లిదండ్రుల గూర్చి
తలచుకొని తలచుకొని
తన మనోబాధ ల
క్ష్మణునితో చెప్పుకొని
దుఃఖపడుచుండగా రేయి!
తొలగిపోయినది వాపోయి!

**భరద్వాజాశ్రమము** (వనవాసంలో 4వనాటి రేయి)

తెలవారె ప్రొద్దెక్కె
దిశలెల్ల వెలబారె
జానకీ రామ ల
క్ష్మణులు పయనమ్మైరి

కాలినడకన వారు
గంగ యమునా సంగ
మ ప్రదేశాభిముఖు
లై ప్రయాణించుచును
వివిధాటవులు దాటి
వెళ్లుచుండగ ప్రొద్దు
వాలవచ్చినదపుడు
వాహినీ జలపర
స్పరఘట్టన ధ్వనులు
స్పష్టముగ వినవచ్చె

హరిణాది మృగములు వి
హంగాలు మనధను
ర్బాణముల గని బెదరి
పారిపోవుచు నుండె
అగ్నిహోత్రుని ధ్వజ
మ్మటు యజ్ఞధూమమది
యెంత ఎత్తుగ నెగసి
యెగసి కనుపించునది

అది భరద్వాజముని
యాశ్రమంబైయుండు
అది ప్రయాగ క్షేత్ర
మదెచూడు లక్ష్మణా!

అని రాముడనుచు ముం
దడుగు లిడిపోగ!
అదెవచ్చె ఆశ్రమం
బెద పొంగిపోగ!

అంతటను వారలా
ప్రాంతము ప్రవేశించి
ముని హోమక్రతువది
ముగియు వరకునువేచి

తరువాత ఆమునిని
దర్శించి పాదాభి
వందనము లర్పించు కొనిరి
స్వపరిచయమొనరించు కొనిరి

ఆభరద్వాజముని
ఆదరంబున వారి
కర్ఘ్యజలములనిచ్చి
అడవిమూలఫలాది
ఆహారముల నొసగి
ఆరాత్రి శయనించు
యేర్పాటులను చేసినాడు!
ఇంపొలర మాట్లాడినాడు!

రామ! దశరథమహా
రాజు నిను నిష్కార
ణముగ వనములకంపి
నాడన్న వార్త విం
టిని మీరలిటవత్తు
రని తెలిసియుంటి మీ
కిష్టమగుచో మీర
లిచ్చోట వసియించ
వచ్చునని పలికె మునివరుడు!
బదులిట్లుపలికె రఘువరుడు!

మునివరా! ఇచ్చోటు
వనవాసమునకు మా
కనుచితముగా నున్న
దదియెట్లు లన్నచో
పల్లియల కిది సమీ
పమునన్నున్నది ప్రజలు

మము జూడవచ్చెదరు
మాదీక్షకంతరా
యము గల్గుగాన మునిముఖ్య!
అన్య ప్రాంతముదెలుపుడయ్యా!
అని రాముడడిగి నం
తనె భరద్వాజముని
శ్రీరఘూత్తమ! వినుమ!
చిత్రకూటం బనెడి
పర్వతము గలదిటకు
పదికోసులుండునది

పగమ రమణీయమై
పరమ కమనీయమై
పరమర్షి సేవిత
ప్రాంతమై అలరారు.

అది చిత్రకూటాద్రి
అచ్చోట మీరు వసి
యింపుడని మునివరుం
డెలమి ఆచిత్ర కూ
టము జేరు మార్గమును గూడ!
తమి చెప్పె రాఘవుని తోడ!
ఇట్లుమునితోడ ము
చ్చట్లాడుచుండగా
రాత్రి చల్లని తల్లి
రానె వచ్చెను జనక
జా రామ లక్ష్మణుల
శ్రాంతులను జేయగా

ఆరాత్రి యంత,వా
రాభరధ్వాజముని

ఆశ్రయములో పరి
శ్రాంతులై సుఖముగా
గడిపిఉదయమె మేలుకొనిరి!
బడలికంతయు దీర్చుకొనిరి!

(కానవాసముననా
ల్గవనాటిరేయి అది
ఆభరద్వాజముని
ఆశ్రమములో గడిచె)

అపుడు రాముడు మునికి
అభివాదమొనరించి
శెలవొసంగుడు మహ
ర్షీ! అనుచు ప్రార్థించె

జానకీ రామ ల
క్ష్మణులంతమునిచెప్పి
నట్టి మార్గము బట్టి
యాచిత్రకూటాద్రి
చేరుటకు పయనించ
వారివెంబడి సుతుల
సాగనంపగ జనకు
డేగినట్లుగ మునియు
కొంత దూరమ్మేగి నాడు!
కొండంతప్రేమగలవాడు!

**చిత్రకూటానికిదారి**

మునిచెప్పినట్టిత్రో
వనుబట్టి పోవుచును
వారు యముమానానదీ
తీరము సమీపించి,

జనుల రాకలపోక
లనుబట్టి తొక్కిడై
బాటగా నలిగి యే
ర్పడిన చోటునువారు

అనువుగానెంచి ఎం
డిన కొయ్యలనుదెచ్చి
వెదురుబొంగులుపేర్చి
వేళ్లతో కట్టి తె
ప్పనుచేసికొనియందు
పచ్చనాకులు పేర్చి
తెప్పసాయముతోడవారు.
ఒప్పుగా నది దాటినారు.

యమున దక్షిణతీర
మది అచట శ్యామమను
దండివృక్షము వారు
దర్శించు కొని నారు

**శ్యామవృక్షమునకు**
**సీతమ్మమొక్కుకొనుట**

ఆవృక్ష రాజమున
కంజలిడి సీతమ్మ
క్షేమముగ తాను తన
స్వామితో మరిదితో
తగ తిరిగి వచ్చునటు
దయజూడు మనుచు ప్రా
ర్థన జేయుచును ప్రద
క్షిణము గావించినది

అటనుండి మళ్లీ ప్ర
యాణమ్ముసాగించి

దారి పొడుగున అద్భు
తములైన మృగపక్షి

తరులతాగుల్మముల
గిరిశిఖర నిర్ఝరుల
చూచుచును సీతకవి
చూపించుచును ముందు
సాగి పోగాపోగ ఇనుడు!
చల్లబడి పొసాగె నపుడు!

## యమునానదీతీరం

**(వనవాసంలో 5వ నాటి రేయి)**

మధురఫలములు వేట
మాంసములభుజియించు
చును ప్రొద్దు క్రుంకగనె
అనువైన ప్రాంతమును
వెదకుకొని అచ్చోటవారు!
విశ్రాంతులై పోయినారు!

తెలవార వచ్చె ప
క్షుల కలకలారవము
వినవచ్చె నిదుర మే
ల్కొనెముందు రాఘవుడు
తానులేవక ముందె
జానకియులేచె అపు
డింకయును కునుకుచుం
డిన లక్ష్మణుని జూచి

తెలవారుచుండె ప
క్షులు మనోహరముగా
పాడుచున్నవి మనము
పయనమై పోవలెను
లక్ష్మణా!లే అనుచు
రాఘవుడు మేల్కొలిపె

అంతటను వారలా
యమునా నదీనిర్మ
లోదకంబుల స్నాన
మొనరించుకొని ప్రాత
రాహ్నికాలను దీర్చు
కొన్నార లాపిదప
చిత్రకూటము జేరవారు!
శీఘ్రమగ పయనమైనారు!

## చిత్రకూటము

అదివసంతము ప్రకృతి
అందచందాలన్ని
అక్కడే ప్రోదిగొని
అలరారునట్లుండె

చెట్టుచెట్టొక ముద్దు
చెలికత్తెవలె పూల
దండలను వేసికొని
నిండుగా కనిపించు,

గలగలా ప్రవహించు
సెలయేళ్లపైనుంచి
దూకుజలపాతాలు
ఆకట్టుకొనుచుండు

రంగురంగుల పూలు
రమణీయమై యొప్పు
అడవిపక్షిమృగాలు
అందముగ అలరారు.

అదిగొ!ఎర్రటిపూల
నలరు మోదుగుచెట్లు
మండిపోతున్నట్లు
మరిమురిసి విరబూసె.

అట నల్లజీడిచె
ట్లెట విరగ గాచినవి!
తమచుట్టుకంపలను
దండిగాబెంచినవి.

తేనెటీగలు గూర్చు
తేనెపెరటొక్కొకటి
రెండుతూములతేనె
నిండియుండి గ్రహించు
వారు లేకుంట వ్రే
లాడు కొమ్మలయందు.

అటుచూడు! ఆవన
ప్రాంతమంతయు పూల
పాన్పులను పరిచినటు
కన్పించు-వాటిపై
కూర్చుండి యును వాన
కోకిలలు కూయగా
బర్హిపికములు బదులు
పాడుచున్నవి చూడు!

పక్షుల ధ్వనులతో
ఫలపుష్పతరులతో
అతిమనోహరముగా
అగుపించు ప్రాంతమిది

మంచినీళ్లిచట లభి
యించుపుష్కలముగా
బహుళఫలమూలములు
ప్రాప్తించు విరివిగా

ఇది వసంతముగదా
అదిగొ చూడు మనేక

విధమలగు వల్లికలు
విరబూచి వృక్షముల
పెనవేసి కొన్నవెటు
ప్రియురాండ్రు తమగల
బిగికౌగిలించుకొనునట్లు
విడివడని దాంపత్యమట్లు

ఇదెచిత్రకూటాద్రి
ఇకమనము గమ్యమును
చేరుకొంటిమి ముని
శ్రేష్ఠులిట వసియింత్రు

సమతలము సారవం
తములైన చెట్లతో
నెసలారు ఇటమనము
వసియింపగా దగును.

## వాల్మీకిమునిదర్శనం

అనుచు రాఘవుడిట్లు
ఆనందమునపొంగి
అనుజుతోభార్యతో
అడుగులిడు చుండగా

అచటనొక మునివరుని
ఆశ్రమము కనిపించె
అదియెవాల్మీకిముని
ఆశ్రమంబై వెలసె.

జానకీ రామ ల
క్ష్మణులుఆ ఆశ్రమ
మందరిగి వాల్మీకి
కభివాదమొనరించి,

నను రాము డందురని
తనపేరు చెప్పికొని

ఈమె నాసతి సీత
ఇతడు లక్ష్మణుడు నా
తమ్ముడని వివరించె
తాపసికి రాఘవుడు

వాల్మీకిముని వరుడు
వారలకు స్వాగతము
పలికి కుశలప్రశ్న
ముల నడుగ, రాఘవుడు
తమదు వనవాస వృ
త్తాంతమును వివరించె

ఆ విషయ మాలించి
ఆర్ద్రుడై వాల్మీకి
ముని ఖేదమొందేనో
యన చిత్రకూటాద్రి
వీడి తమసానదికి
వెడలి పోయెనుపిదప

**పర్ణశాలనిర్మాణం**
**వాస్తుశాంతి**

లక్ష్మణా!ఇచ్చోట
లక్షణముగా నున్న
దిట పర్ణశాల నిం
పెసగ నిర్మించవలె

గట్టివగు దారువుల
గట్టు మొక్క కుటీర
మనుచు రాముడుపలుక
అంత లక్ష్మణు డేగి,

దృఢమైన దూలముల
దెచ్చి యప్పటికప్పు
డొక పర్ణశాల నిం
పొనరగా నిర్మించె

గాలికిని వానలకు
కాసంతయును దెబ్బ
తినకుండపర్ణశా
లను గట్టె లక్ష్మణుడు

అదిచూచి శ్రీరాము
డానందమున పొంగె
సౌమ్యుడా!ఇకవాస్తు
శాంతి జేయగ వలయు

చిరసౌఖ్యములతోడ
జీవించవలెనన్న
వారవశ్యముచేయ
వలె వాస్తుశాంతులను.

గృహదేవతల భక్తి
నెసగ పూజించవలె
హరిణమొకదాని వే
టాడి ఇటగొని తెమ్ము.

అనిరాముడని నంత
టనె లక్ష్మణుండేగి
హరిణమును వేటాడి
ఆలసింపక తెచ్చె.

దానిగని రాఘవుడు
దీని మాంసము పక్వ
మగు వరకు వండవలె
ఆలసించగ రాదు.

ఈనాటి తిథియు యజ
మానికి మనోస్థైర్య

మిచ్చు మంచి ముహూర్త
మిది నీవు త్వరపడుము

అంత సౌమిత్రి·ఆ
హరిణమును మండుని
ప్పులలోన పడవేసి
పొలపార నుడికించె

అగ్రజా! చూడుమీ!
హరిణము సమస్తావ
యవమ్ములతో పక్వ
మైపోయినది యికను

వాస్తు దేవత పూజ
శాస్త్ర పద్ధతి జేయ
నీవె తగుదువు వాస్తు
కోవిదుడ వీవు కద!

మనుకులుడు రాఘవుడు
మంత్రకోవిదుడంత
స్నానమొనరించి సు
స్నాతుండునైవాస్తు
యాగోపయుక్తంబు
లగుమంత్రములనెల్ల
జపియించి వాస్తు య
జ్ఞము పూర్తిచేసి గ్రహ
దేవతల నెల్లరను
తృప్తిగా పూజించి
ఆపిదప సీతతో
అనుజులక్ష్మణునితో
పర్ణశాలను ప్రవేశించె!
పరమహర్షమునపులకించె!

వైశ్వదేవము, రౌద్ర
వైష్ణవాదిక బలుల
వరుసగానర్పించి
వాస్తుదోషము దొలగు
నట్లు పుణ్యాహవచ
నాది మంగళ కార్య
ములనుగావించి, క్రమ
ముగను నాయా విహిత
మంత్రములజపియించినాడు!
మరల స్నానము చేసినాడు!

సకలపాపాల సం
శమనమ్ముకై క్రూర
భూతాల శాంతింప
పూన్కి బలులను వైచి
పిదప యుత్తమబలిని
విధిగ తగ నర్పించి
శాస్త్రవిధి రాఘవుడు
వాస్తుయాగమదెంత
చక్కగా నొనరించి నాడు!
క్షత్రియుండై గూడనాడు!

రాముడాపర్ణశా
లకు తగినరీతి బలి
హరణాది వేదికలు
అగ్నిహోత్రగృహాలు,
దేవతాగృహమున్ను
తీర్చి నిర్మించుకొనె

పూలదండల చేత
మూలఫలములచేత
పక్వమైనట్టిమాం

సముచేత్, జలతర్ప
ణలచేత మంత్రజప
ములచేత సమిధద
ర్భల చేత రాముడిం
పలరశాస్త్రోక్తముగ
భూతశాంతినొనర్చెనపుడు!
భువినెంతవాస్తుపండితుడు!
వాస్తుసమ్మతముగా
వంటగది యాదిగా
గల ప్రదేశాలతో
గాలియురవడి లేని
దగు గట్టి నిర్మాణ
మగు పర్ణశాలలో

రఘువరుడు జానకీ
లక్ష్మణలతోగూడి
దేవగణములగూడి
దేవేంద్రుడు సుధర్మ
మను సభాభవనమం
దున ప్రవేశించి నటు
శుభవేళలో ప్రవేశించె!
అభమంటరాదనుచునెంచె!

అపర్ణశాల య
త్యంత సుందరమనో
హరపుష్పగుచ్ఛ సం
భరితవృక్షాలతో
పలువిధములైన మృగ
పక్షి జాలమ్ముతో

దూరాననుండి ఘీం
కారాలుసేయుమద
కరులాది మృగ సము
త్కర గర్జనలతోడ
స్వచ్ఛజలముల తోడ
జలజలాప్రవహించు
మంచి తీరములుగల
మాల్యవతి నదియొడ్డు
నందువిహరిచుచును
అయోధ్యవిడుచుటచే
గలుగుదుఃఖము మరచి వారు!
ఎలమి గడుపగ సాగి నారు!

## చతుర్థాశ్వాసము

### సుమంత్రుని తిరిగిరాక

జానకీ రామ ల
క్ష్మణులు గంగనుదాటి
దక్షిణపుదిశబట్టి
తరలిపోవుచువారు
కనుమఱుంగయిపోవు
దనుక చూచి గుహుండు
దుఃఖార్తుడై సుమం
త్రుని వెంట దోడుకొని
రఘువరుని గూర్చి మా
ట్లాడుచును గృహమేగె

గుహుని పంపున వెళ్లి
గూఢచారులు నాల్గు
దినములకు రామాదు
లను గురించిన సమా
చారమును వివరించి
నారిట్లు వినయముగ

గంగమ్మదక్షిణపు
గట్టుజేరిన పిదప
రామయ్యసీతతో
లక్ష్మన్నతో భర
ద్వాజముని యాశ్రమము
దర్శించి యారాత్రి
యటవిశ్రమించి ఉద
యమె పయనమయి చిత్ర
కూటాద్రిపై జేరి
కుటిక నిర్మించుకొని
అట వసింపగ నెంచినారు!
అనుచు చారులుదెల్పినారు!

చారులు వివరించి నట్టి
సమాచారమంతయువిని
గుహునితో సుమంత్రుడు వీ
డ్కోలుగొని అయోధ్యకరిగె

దారిమధ్యనాగకుండ
త్వరత్వరగ తేరుమీద
అయోధ్యకు మూడవనాటి
సాయంత్రానికి చేరెను

పట్టణమంతయునుపాడు
పడిపోయినయట్లుండెను
రాముడేడి? యనుచుప్రజలు
సుమంత్రుని ప్రశ్నించి నారు

అయ్యో అయ్యో రాముడు
అడవులపాలైపోయెను!
రాముడులేకుండ మనము
బ్రతికియుచచ్చినవారము!

రథముపై సుమంత్రుడొకడె
రావటమునెఱింగి స్త్రీలు
కిటికీలోనుంచి చూచి
ఖిన్నవదనులైపోయిరి

శిరమువంచుకొని సుమంత్రి
వరుడు రాజవీథిన రథ
మును వేవేగమున తోలు
కొనుచు రాజభవనమేగె

ఏడుకక్ష్యలను దాటెను
ఎనిమిదిలో ప్రవేశించి
అటకూర్చుని యున్న ప్రభువు
కభివాదమ్మొనరించెను

రాముడు తనతండ్రితోడ
ఏమి చెప్పమనెనో ఆ
మాటలన్నిచెప్పినాడు
మహారాజుతో నాతడు

దశరథుడామాటలన్ని
తగవినెనోలేదో యను
నట్లాడతడు ఏమియుమా
ట్లాడక విభ్రాంతిజెంది
స్పృహను దప్పినేలమీద
విరుచుక పడిపోయినాడు

అంతఃపుర వనితలంద
రపుడు ఎదలు బాదుకొనుచు
గొల్లుమనిరి రాజభవన
మెల్ల ప్రతిధ్వనులనిండ

కౌసల్యసుమిత్రలు తమ
కాంతుని వే లేవనెత్తి

రంత మహారాజుకు ర
వ్వంత తెలివి వచ్చెనపుడు

అప్పుడు కౌసల్యఇట్టు
లన్నది దశరథుని తోడ
ఓరాజా! కానిపనిని
నీరాముడు చేసినాడు
అతని వద్దనుండి వచ్చి
నట్టిదూతతో నీవిపు
డేటికి మాట్లాడకుంటి
విచట కైకలేదిప్పుడు

నిర్భయముగ మాట్లాడుము
నీకిచ్చట భయమేటికి?
అనిదగ్గుత్తికతో వ్యం
గ్యముగ మాటలాడుచు కౌ
సల్యదుఃఖవశమునతత్
క్షణమె నేలబడిపోయెను

నేలంబడిపోయిన కౌ
సల్యను నిర్ఘాంతపోయి
నట్టిమహారాజుని గని
ఆయంతఃపురస్త్రీలు
గొల్లుమనిరి, అంతటనా
ఘోరవిలాపధ్వను లా
యంతఃపురమందెగాక
అయయోధ్యనిండిపోయె!

**దశరథుడు సీతారామ లక్ష్మణుల వృత్తాంతమడుగుట**

కొంగ్రొత్తగ జబ్బువడ్డ
కుంజరమటు దిగ్భ్రమతో
రామా రామా యని దశ
రథుడు బిగ్గరగ నరచెను

బొమ్మలాటలో బాలుడు
పొరబడి తనబొమ్మరిల్లు
కూలగొట్టుకొని గొల్లున
గోలపెట్టి యేడ్చినట్లు

సుమంత్రుని దగ్గరగ బిలిచి
క్షుభితహృదయుడై గద్గగ
మదర నతనితో దశరథు
డార్తిజెంది పలికెనిట్లు
రాముడుసీతాలక్ష్మణ
సమేతుడై యెటుబోయెను
యేమిదినెను యెట్లుండెను
సుమంత్రా!నాతోజెప్పుము

చతురంగబలాలువెంట
చనుదెంచగ బయల్వెడలు
రాముడెట్లునడచి వెళ్లె
ఓమంత్రివరా!చెప్పుము

క్రూరమృగాలుండుచోట
ఘోరాటవి నాకొడుకులు
నాకోడలు యెట్లుండిరి
నాతోచెప్పుము సుమంత్ర!

ఎన్నడేని ఇంత కష్ట
మెరుగని సుకుమారిసీత
నాకోడలు కటికనేల
నడిచెనెట్లు చెప్పుమయ్య!

ఏమితినిరి యెట్లుండిరి
యెచటపండుకొనిరి వారు

నాకొడుకులు నాకోడలు
కీకారణ్యములోపల
నేట్లున్నారోచెప్పుము
మేమన్నారో చెప్పుము

అని దీనముగా దశరథు
డడుగ సుమంత్రుడు తడబడు
మాటలతో రాముడన్న
మాటలన్ని వివరించెను

**రాముడన్న మాటలు**
జననీజనకులకు భక్తి
సాష్టాంగ ప్రణామములను
చేసితినని చెప్పు మనియె
శ్రీరాముడు కేలుమోడ్చి

తమ్ముని భరతునితోడను
తల్లులనందరిని భేద
భావములేకుండ నొకే
భావముతో చూడవలయు

అనికన్నుల నీరుగ్రమ్మ
కొన భరతా! మీఅమ్మకు
నీవెంతటి ప్రాణమ్మో
నేనంతే మాయమ్మకు

గాన పుత్రశోకములో
గాసిలుమాయమ్మను మీ
అమ్మను గనునట్లే మా
అమ్మను గనుచుండవలయు

అనినాతో చెప్పుచు రా
జా! ఆరాముడు జలజల
కన్నీళ్లను గార్చినాడు
చిన్నపిల్ల వానివోలె

**లక్ష్మణుడిట్లన్నాడు**
కోపముతో బుసగొట్టుచు
కొడెత్రాచువలె లక్ష్మణు
డాగ్రహాన ఇట్లనియెను
అవనీశా! అవధరింపు

రాముని అపరాధమేమి
రాజు వెళ్లగొట్టినాడు
కైకేయీదేవి రాజ్య
కాంక్షచేత అడుగగనే

అధికారము చేతనున్న
దని వరదానములనొసగి
చేయరానిపని చేసిన
ఛీయనరే రాజేంద్రుని

నాకీలోకములో ఇక
నాన్నయైన అన్నయైన
ప్రభువైనా బంధువైన
రాముడొకడె యనిపలికెను

**సీతమ్మ ఇట్లన్నది**
మహారాజ! ఎల్లప్పుడు
మందహాసమొలకించుచు
మాట్లాడే సీతాసతి
మదిలో కలవరమొందుచు

వెర్రిదానిచందము ని
ట్వేరపోవుచు నిట్టూర్పులు
విడుచుచు నాతో ఏమియు
నుడవలేక ఊర్కున్నది

ఆమె ముఖము వాడిపోయి
అశ్రులతోక్రమ్మియుండె
నేను బయల్దేరునపుడు
దీనముగా భర్తవంక

చూచుచు కన్నీళ్లుగార్చు
చును నావంకను చూచుచు
నేడ్వసాగె రఘుసోదరు
లెంతగ నాశ్వాసించిన

మహారాజ! సీతారా
మలక్ష్మణులు గంగానది
దాటి అడవిలోని కేగి
తరలివెళ్లిపోయినారు

నేనీవలిఒడ్డునందు
నిలిచి చేతులెత్తి నమ
స్కరించి వెనుకకుమళ్లితి
జలజలకన్నులు స్రవించ

ఎత్తిదించినట్టి సన్ని
హితుడనైన అస్వతంత్రు
డను వెనుకకుమళ్లితి రా
ముని అడవిని విడివచ్చితి!

నారథాశ్వములు కదలక
నయనమ్ముల నీరుగార్చె
ఎట్లెట్లో శృంగి బేర
మేగితి రథమునుదోడ్కొని

రామునడవి విడిచి తిరిగి
రావడానికేమాత్రము
కాళ్లాడక గుహునివద్ద
గడిపితి నాల్లుదినమ్ములు

రాముడు నాకేమైనా
రమ్మని కబురంపునేమొ
అతదెచ్చటకేగెనొ సం
గతినెఱుంగదలచినేను

గడిపినానుగుహుని వద్ద
బెడదతోడనాల్లునాళ్లు

వారుభరధ్వాజ మునీ
శ్వరుని జూచిచిత్రకూట
మరగి అటవసింపనెంచి
రని చారులువినిపించిరి

ప్రభువర! రాముండడవుల
పాలయిపోయెనటంచును
చెట్టుచేమ వాడిపోయె!
చెరువుల నీరెండిపోయె!

పక్షులుపాడుట మానెను
పశువులుమేతను ముట్టవు
క్రూరమృగాలును తమ ఆ
హారానికి వెడలలేదు

అడవియందెకాదు అయో
ధ్యానగరము రాముడడవి
పాలయ్యెనటంచు దుఃఖ
పాదోధినిమునిగిపోయి
కౌసల్యాదేవి వోలె
కనపడుచున్నది రాజా!

**దశరథునివిలాపం**

అనిసుమంత్రుడాడినంత
విని దశరథరాజేంద్రుడు
ఖిన్నహృదయుడై బొటబొట
కన్నీళ్లను గార్చినాడు

ఓసుమంత్ర! నేనకార్య
మొనరించితి పాపిష్ఠిది
కైకనన్ను మోసగించి
నాకన్నులు కప్పివైచె

మంత్రులతో వృద్ధులతో
మాటకైన సంప్రదించ
నైతి కేవలమ్మొక స్త్రీ
వ్యామోహములో బడినే
చేయరానిపని చేసితి
ఛీయని అనిపించుకొంటి

ఎప్పుడైన నీకు నేనా
కించుకేని ఉపకారము
చేసినాడననియెడి వి
శ్వాసము నీకున్నయెడల
ననురాముని కడకునీవు
గొనిపోవలయును, నేనిక
జీవింపగ జాలను ఆ
శ్రీరాముని జూడకున్న

ఇంకను నాఆజ్ఞ జరుగు
నేనిరామునిటకు తీసి
కొనిరమ్మా లేకుండిన
క్షణమైనను బ్రతుకలేను

ఓసుమంత్ర నీకుపుణ్య
ముండునన్ను గొనిపొమ్మిక
శ్రీరాముని జూడకున్న
జీవింపగ జాలనేను

ఓకౌసల్యా నేనిక
శోకజలధిమునుగుచుంటి
తరుణోపాయమురాముని
దర్శన మొకటే కావలె

రాముని దర్శించలేను
ఏమిసేతు రామవియో
గాబ్ధిదాటలేక నిట్టు
లకటా విలపించుచు నే
చావనుంటినని మూర్ఛిలి
శయ్యమీద వ్రాలిపోయె!

## కౌసల్యాదేవినిష్ఠురోక్తులు

కౌసల్యాదేవి అంత
గాబరపడి కంపిల్లుచు
దయ్యముపట్టిన దానిగ
ధరపైబడి పొర్లసాగె

కౌసల్యాదుఃఖజలధి
కట్టలుతెగి పొంగసాగె
సుమంత్రుడెంత ఓదార్చిన
సుంతయూఅడిల్లదయ్యె

పుత్రవియోగపు దుఃఖము
భర్తకు కల్గిన దుస్థితి
కైకేయీ మోసగింపు
కర్కశమై బాధింపగ
కౌసల్యాదేవి పతిని
కఠినముగా తూలనాడె

కైకమాటవిని రాముని
కాడడవికి పంపినారు
దుఃఖసముద్రముననన్ను
త్రోసివేసిముంచినారు

సతికి మొదటిగతి పతియే
సుతుడుతనకు రెండవగతి
ఆయుభయులులేనప్పుడు
అయినవారె గతి యగుదురు

నాకుమీరు మూడుగతులు
లేకుండగ జేసినారు

నాసవతికి లొంగిమీరు
నాకుకాక పోయినారు

కన్నకొడుకు నడవికంపి
కాకుండా చేసినారు
అయినవారలున్నను లే
నట్లే యయిపోయినారు

మీప్రియభార్యను కైకను
మీప్రియపుత్రుని భరతుని
సంతసపరుచుట కొరకే
ఇంతపనిని చేసినారు

అని కఠోరనిష్ఠూరము
లాడుచు కౌసల్యాసతి
బిగ్గరగా దిక్కులెల్ల
పిక్కటిల్లునట్లేడ్చెను

**దశరథుని పశ్చాత్తాపం**

ఆదారుణమైన మాట
లాలకించి మహారాజు
అమితఖేదమొందినవా
డై ఏమి అధర్మము నే
చేయుటచే నాకీదు
స్థితిగల్గినదని తలచెను

మునుపు శబ్దవేధి చేత
మునిబాలుని మృగమనుకొని
చంపినట్టి అఘమతనికి
చప్పున జ్ఞప్తికి వచ్చెను

అంతదుఃఖమతిశయించి
అతనిమేను కంపించెను
అప్పులవాడెదురు వచ్చి
అడిగిన యట్లనిపించెను

తలవాలిచి చేమోడిచి
తడబడుచును మహారాజు
కౌసల్యా! నీవునన్ను
కనికరించి క్షమియించుము
నీవీవిధికఠినమైన
నిష్ఠూరములాడవలదు

నీవెంతో మంచిదాన
విపుడు నన్నుదయజూడుము
ధార్మికులైనట్టి స్త్రీలు
తమభర్తగుణావగుణము
లెంచక పతియేదైవమ
టంచునెంచెదరు నీవును

ధార్మికురాలవు నన్నిక
దయజూచి క్షమించవలయు
దీనుడ దుఃఖితుడ నన్ను
దేవీ! మన్నించవలయు

అనిజాలిని గొలుపునట్లు
అవనీశుడు పలికినంత
కౌసల్యాదేవి గుండె
కరిగిపోయి కనులనుండి
జలజల కన్నీళ్లురాలె
జడివానలు కురిసినట్లు

పెనిమిటి చేతులను బట్టు
కొని తనతలమీదపెట్టు
కొని సంభ్రమమున దేవా!
నను క్షమించవలెను మీరు
మీరునన్ను యాచించిన
కారణమున పాపినైతి

ఏస్త్రీ తనపతినితనను
యాచించెడి విధమున ని
ర్భంధించునొ ఆస్త్రీ కిహ
పరములందు సుఖముండదు.

ఈధర్మము నేనెఱుగుదు
నేమిసేతు పుత్రశోక
మునబుద్ధినశించి మిమ్మ
లను ఏవోమాటలంటి

అయిదురాత్రులాయె రాము
డడవికేగి అవినాకిపు
డైదుయుగాలైపోయెను
నాదుఃఖము మితిమీరెను

రామునిదలచుకొనంగనె
నామదిదుఃఖాతిశయము
నొందు నదీవేగంబున
ఉదధివృద్ధిపొందినట్లు

ఈవిధముగ కౌసల్యా
దేవి మాటలాడుచుండ
సూర్యుడస్తమించె రాత్రి
క్షుభితుల నోదార్చవచ్చె

**మునిశాపవృత్తాంతం**

రాము డడవికేగిన యా
రవరోజది అర్ధరాత్రి
ఆనృపతికి మునిశాపము
అప్పులవాడరయునట్లు

మరలవచ్చె జ్ఞాపకమున
కరయ అప్పుతప్పునెట్లు?
మునుతా చేసిన దుష్కృత
మును తలంచుకొని దానిని

కౌసల్యకు చెప్పదలచె
గాసిల్లిన మహారాజు
ఏడ్చియేడ్చి యెట్లెట్లో యొ
కింత రెప్పవాల్చిన కౌ

సల్యమ్మను మేలుకొలిపి
జనపాలుండిట్లనియెను

కల్యాణీ! వింటావా!
కర్మఫలము తప్పదనెడి
సత్యము నాయెడబుజువై
చాటిచెప్పుచున్నదిపుడు

బహుకాలంబయ్యెను అ
ప్పటికింకను మనకల్యా
ణముకాలేదపుడు యౌవ
నములోనున్నాడనేను

యువరాజును శబ్దవేధి
నొనర నేర్చుకొన్నాడను

అది వర్షాకాలము మే
ఘావృతమైనట్టి రాత్రి
వేళ నేనువేటాడగ
వెళ్లి నానరణ్యమునకు

వనిలో నేపొంచియుంటి
వినిపించెను గుడగుడ చ
ప్పుడు అంతే చప్పుడు నే
నడవిఏన్గు నీళ్లుద్రాగు

చున్నదనుచు వాడిబాణ
మొకటి వదలివేసినాను

అయ్యో! అమ్మో! అబ్బో!
అనిమనుష్యకంఠము విన

వచ్చెనంత నాగుండెలు
వ్రక్కలయ్యె వణకుపుట్టె

నేను తపస్విని నాపై
ఎట్లుశరము వచ్చిపడెను!
ఎవనికేమి యపకారము
కింతనేను చేయలేదు

ఎవ్వరులేనప్పుడు ఈ
యేటికినేరాత్రి సమయ
మందునీళ్లుముంచుకొనగ
నరుదెంచితి నన్నేటికి
బాణముతో కొట్టినాడు
వానికేమి లాభమొదవు?
అనిస్పష్టముగా మనుష్యు
డన్నట్లుగ వినివచ్చెను

అచ్చోటికి నేవెళ్లితి
అగుపించెను మునిబాలుడు
బాణహతుండై నేలం
బడి విలవిలలాడుచుండె

ఆమునిబాలుడు భీతుడు
నైయుండిన ననుదహించు
వానిగ చురచురచూచుచు
పరుషముగా పలికెనిట్లు

నన్నెందుకు చంపినావు
నా అపరాధం బేమిటి?
నిర్దాక్షిణ్యముగా నను
నిష్కారణముగ చంపితి

నాతలిదండ్రులు అంధులు
నాపై నాధారపడిన

వారు వయోవృద్ధులు ది
క్కెరు వారికిపుడుచెప్పు?

నాప్రాణముతో పాటుగ
నాతలిదండ్రులప్రాణము
లను తీసితివేమి ప్రయో
జనము నీకు ప్రాప్తించెను

పశ్చాత్తాపమున నేను
బాలునితో నాపొరపా
టును చెప్పితి ననుక్షమించు
మని మిక్కిలి ప్రార్థించితి

మునిబాలుడు వెంటనెనను
తనతలిదండ్రుల దగ్గర
కరగి యధార్థము వారికి
నెరిగించుమటంచు చెప్పె

బాధభరించగ లేనీ
బాణమ్మును తీసివేయు
మని అడిగెను అంతబాణ
మును నేతీసితి బాలుడు
ప్రాణములను వదలివేసె
పాపభీతచే వణకితి

అపుడు నేను నతడుతెచ్చి
నట్టి నీటికడువతోడ
జంకుచు ఆవృద్ధులనే
సమీపించి నాకులగో
త్రాలు చెప్పుకొని జరిగిన
తప్పిదమును తెలుపుకొంటి

క్షమియించిన శపియించిన
సంసిద్ధముగా నున్నా

నని వారికి చెప్పుకొంటి
నపరాధంబొప్పుకొంటి

మొదలునరికినట్టి వృక్ష
ములవలె ఆవృద్ధదంప
తులు నేలంబడిపోయిరి
దుస్సహమది తిలకించితి

వారుకొంతవడి స్పృహకు
వచ్చికొడుకు కళేబరము
పైబడి దుఃఖించుచునను
పరుషముగా నిందించిరి

తమబిడ్డకు దహనక్రియ
తర్పణాదులిడి తదుపరి
దుఃఖములో తాపసినా
తోనిట్లనె పరుషముగా

చేసిన పాపము స్వయముగ
చెప్పుటచే బ్రతికితీవు
కాకుండిన నీతల ఈ
క్షణమె వ్రక్కలైయుండును

తెలియక చేసితివికాక
తెలిసిచేసియుండిన చో
నీవంశమె ఈక్షణమే
నిర్మూలనమైయుండును

ప్రాణక్షయకరమునైన
భయంకరమునగు ఈస్థితి
మాకిచ్చితి వీస్థితియే
నీకుగలగు నంత్యదశన

మాకంత్యమునందు పుత్ర
శోకము గలిగించినావు

నీకును మావలెను పుత్ర
శోకమొదవి మరణింతువు

ఇట్లు ననుశపించి వార
లిద్దరు దంపతులాచితి
నారోహణ చేసిస్వర్గ
మారోహించిరి వెంటనె

చిన్నతనములో తెలియక
చేసినపాపము ఇప్పుడు
జ్ఞప్తికి వస్తున్నది ముని
శాపము తగులుచున్నది

అపథ్యభోజనమువలన
వ్యాధివచ్చునట్లు పాప
కార్యఫలంబిప్పుడు దుః
ఖాకృతిలో ప్రాప్తించెను

సుగుణవతీ! ఎవడిశుభా
శుభకర్మఫలాలవాడు
అనుభవించ తప్పదనుచు
అవనీశుడు మరియిట్లను

పుణ్యవతీ! నేనిప్పుడు
పుత్రదుఃఖమును భరించ
జాలకమరణించనుంటి
చక్కగనను స్పృశియింపుము

అనిదీనముగా దశరథు
డార్తిజెంది కౌసల్యకు
తామును చేసినపాపము
తాపసి శాపము నిప్పగి
దిని చెప్పుచు పుత్రశోక
మును భరించలేక రామ

రామా యని విలపించుచు
ప్రాణములను త్యజియించెను!
అర్ధరాత్రివేళ అయో
ధ్యాపురంధ్రి విధవయ్యెను!

## ప్రభాతవేళ అలికిడి

తొలివేకువ ఝాములోన
నలుదిక్కుల వెలబాఱెను
నగర ముఖద్వారములో
నగారాలు ధ్వనియించెను

వందిజనాదులు స్తోత్రా
వళికీర్తన సుప్రభాత
మంగళగీతాలు రాజ
మందిరాన మార్మోగెను

పరిచారిక షండభృత్య
పరిజనముల సందడితో
ఆఅంతఃపురమంతయు
అలికిడితో నిండుకొనెను

## కౌసల్యాది రాణులు రోదించుట

కాని మహారాజు నిద్ర
కానినిద్రనుండి మేలు
కొనకుండగ పాన్పుమీద
కొయ్యబొమ్మవలెనుండెను

అంతఃపురిలోని స్త్రీలు
అనుమానముతో ప్రభువును
కదిపికదిపి చూచి తనువు
కట్టెబారి పోవుట గని
బావురుమని యేడ్చినారు
భవనమ్ము ప్రతిధ్వనించ

అంతట రాణులు కౌస
ల్యా సుమిత్ర లులిక్కిపడి
లేచి భర్తపైబడి జా
లిగ నాక్రందించినారు
ఆఏడ్పులధ్వనులకు కై
కేయీ మొదలగు రాణులు
అచటికి నేతెంచినారు
అందరు రోదించినారు

ఆత్మభవుండడవులపా
లైపోయెను ఆత్మేశుడు
దివికేగెను ఇంకెవ్వరు
దిక్కటంచు రోదించుచు

పట్టమహిషి మహారాణి
పట్టరాని దుఃఖములో
నేలంబడి పొర్లాడుచు
బేలవోలె విలపించెను

ధర్మహీనయైన కైక
దక్క మరెవ్వతె దైవస
మానుండగు భర్తను విడి
మననొల్లదు క్షణమైనను

పతిదేహముతోడ అగ్ని
ప్రవేశించి మరణించెద
ననిరోదించెడి కౌస
ల్యను దశరథుకళేబరము
నొద్దనుండి తొలగించిరి
ఉవిదప్రముఖులుకొందరు

పరమ దుఃఖమున దశరథు
ప్రభువరోత్తముని భార్యలు

నేలంబడి పొరలి కంట
నీరొలుకగ రోదించిరి

సుధాకరుడు లేనిరాత్రి
విధము విధవయగుస్త్రీవలె
ఆ అయోధ్యానగర
మ్మకటా! వెలవెలబోయెను

కులస్త్రీలు కన్నుల నీ
రొలుకగ రోదించినారు
గృహప్రాంగణాలు కాంతి
హీనములై పాడుపడెను

హా హా కారాలతోడ
ఆ అయోధ్యనినదించెను
అంతటరవి అస్తమించె
అంధకారమలముకొనెను

## అయోధ్యలో అలజడి

అమాత్యులందుకొందరు మ
హారాజునకంత్యక్రియ
లొనరింతమటంచు పలుక
తనయులెవరు దగ్గరలే

నంధున అది తగదటంచు
కొందరు ముఖ్యులుపలికిరి

దశరథుని కళేబరమును
తైలద్రోణియందుభద్ర
పరిచి భరత కుమారునకు
వార్తపంప నెంచినారు

సూర్యోదయమైనంతనె
కార్యాచరణార్థము కుల
గురు రాజపురోహితుని
పరివేష్టించిరి మంత్రులు

కాశ్యప కాత్యాయన మౌ
ద్గల్య వామదేవ గౌత
మ కీర్తిశాలి జాబాలి
మంత్రివరులు పలికిరిట్లు

ఓవసిష్ఠ మునిశ్రేష్ఠ!
ఓరాజ పురోహితా!
రాజులేని దేశమంద
రాచకమ్ము ప్రబలుగాన

ఈవిషమ పరిస్థితిలో
ఇక్ష్వాకులలో నొకరిని
అభిషిక్తుని జేయవలయు
ఆలస్యము చేయరాదు

## అరాచకత్వదోషవర్ణన

అరాచకమువలన దేశ
మందు ధర్మహాని కలుగు
అక్రమాలు చెలరేగును
అనర్థాలు ప్రబలిపోవు

అరాచకమయిన దేశము
నందు దురాక్రమణ ప్రబలు
అబలకు భద్రత యుండదు
ఆలుండదు పరువుండదు

అరాచకమ్మయిన దేశ
మందున పంటలు దొంగల
పాలవునని రైతు విత్త
నాలే వేయక యుండును

క్రయవిక్రయములు అరాచ
కమువల్లను సాగకుండు
వ్యాపారులు దూరదేశ
వాణిజ్యము సాగించరు

శాంతిభద్రతలు కరువై
జనజీవన మది అరణ్య
ప్రాయంబై క్షణక్షణము
భయకంపితమై పోవును

ప్రాణభయమ్మొకటె యడవి
లోనగాని పట్టణాన
ప్రాణమానధనములకును
హానికలు గరాచకాన

నీతిని హతమారిచి అవి
నీతినిపెంచుచు జాతిని
నిర్భీతిగ దోచుకొనెడి
నీచప్రవృత్తులు ప్రబలును

ధనికులమనితెలియ దోచు
కొని పోదురటంచు జనులు
దానధర్మములు జేయుట
మాని వేయుదురు భయమున

దండనభయమింతలేక
దౌర్జన్యము చెలరేగును
దౌర్జన్యము చెలరేగిన
ధర్మము హతమైపోవును

సొగసుకత్తియలు బంగరు
సొమ్ములు పెట్టుక సాయం
కాలములో వనవిహార
కేళి కోసమై వెడలరు

ధర్మముస్థాపించుటకై
దైవమెయుగయుగాలలో
సంభవించుననెడి సూక్తి
సత్యమ్మైనిత్యమయ్యె

ఎప్పుడెపుడు ధర్మమునశి
యించునొ అపుడప్పుడు నే
నవనినవతరింతుననుచు
ఆదైవమె వాక్రుచ్చెను

పృధ్వీపతియనగ మహా
విష్ణువెయని సూక్తిగలదు
పృధ్వీపతిలేని యెడల
వ్యధామయమ్మగు రాజ్యము

చేపలలో పెద్దచేప
చిన్న చేపలనుమ్రింగు వి
ధానము బలవంతుడు బల
హీనుల కబళించగలడు

దౌర్జన్యము మరీమరీ
దండెత్తుచునుండును బల
వంతుడు బలపడిమరింత
బలవంతుడుగా మారును

బలహీనుడు మరీమరీ
బలహీనుడుగా క్రుంగును
బలవంతుడు మరీమరీ
బలవంతుడుగా ప్రబలును

జారులచే చోరులచే
క్రూరఘోర దుష్టులచే
భయపడి సత్యము నిలువక
భంగపడుచు నశియించును

దేహానికి కంటిచూపు
తెరువై మెలగిన విధమున
దేశానికి రాజుమంచి
తెరువై శుభమును గూర్చును

రాజులేని రాష్ట్రము గో
రక్షక రహితంబగు గో
వ్రజమువలెను జలములేని
వాహినివలె వ్యర్థమగును

మంచిచెడుల విచారించి
మంచిని కలిగించు రాజు
ప్రజలకు తల్లీదండ్రిగ
ప్రవర్తించుచుండుగాన
రాజును ఒకదేవునిగా
ప్రజలు గౌరవించుచుండ్రు

కాని అట్టిరాజె ధర్మ
హీనుడైనచో కంచెయె
చేనుమేసినట్లగునని
వానిగద్దెదించగలరు

దుష్టశిక్షణము సేయుచు
శిష్టరక్షణము సేయుచు
శాంతి భద్రతలు గూర్చుచు
సత్యధర్మముల నిలుపును

పాలకుడే లేకుండిన
ప్రపంచమంతయు చీకటి
కమ్మినట్లు లోకములో
కలుగకుండు మేలేదియు

ఓమహర్షి! రాజుబ్రతికి
యున్నపుడె సముద్రము చెలి
యలికట్టను దాటకుండు
నట్లు మేము నీమాటను
దాటకుంటిమిపుడట్లే
దాటమనుచుచెప్పనేల!

మా మాటలనాలకించి
మహర్షీ! రాజ్యము వన
ప్రాయము గాకుండగ శీ
ఘ్రమె యిక్ష్వాకులలోనొక
నిని రాజుగ నేరుపరిచి
నొనరగ పట్టముగట్టుడు

## భరతుని పిలిపించుట

అట్లు వారు చర్చించిన
ఆమాటలువిని వసిష్ఠు
డనియెనిట్లు - ఆర్యులార!
ఆలోచించుట దేనికి

భరతునిరాజుగ దశరథ
ప్రభువే నియమించె కనుక
భరతుని శత్రుఘ్నునితో
త్వరగా రప్పించవలయు

అని వసిష్ఠుడన్నంతనె
అందుకందరొప్పుకొనిరి
వెనువెంటనె భరతుని త
మ్ముని శత్రుఘ్నుని తోడ్కొని
రమ్మని దూతలపంపెను
బ్రహ్మర్షి వసిష్ఠుడపుడు

తగు తాకీదులతో దూ
తలు తురంగములపై శీ
ఘ్రముగ బోవుచును కేకయ
రాజధాని గిరివ్రజము
రాత్రివేళ జేరుకొనిరి
శ్రాంతులైరి ఆరాతిరి

## భరతునకు దుస్స్వప్నం

ఆరాత్రే భరతునకు భ
యంకరమైనట్టి పీడ
కలవచ్చెను అతని తండ్రి
మలిన దేహుడై శిఖ విర
బోసుక గిరి మీదినుండి
మురికిగుంటలో పడినటు

నూనెత్రాగినటుల మేన
నూనెపూసికొన్నట్లుగ
నువ్వుల అన్నము తిన్నటు
నవ్వుచునున్నట్లు తెల్ల
వారుఝాములో భరతుడు
ఘోరమైన కలగాంచెను

ఎఱ్ఱని పూదండలు ధరి
యించి గాడిదలు గట్టిన
తేరునెక్కి దక్షిణదిశ
స్వారిచేయుచున్నట్లుగ

సంద్రము శుష్కించినట్లు
చంద్రుడు భువిరాలినట్లు
భద్రగజము దంతంబులు
పట్టున విరిగినయట్లుగ

భరతుడుకలగని మిక్కిలి
భయభ్రాంతుడై పోయెను
స్వప్నంబది తెల్లవారు
ఝామున వచ్చెను కావున
కలనిజమగునని భరతుడు
కలతజెందు చుండనపుడు.

తెలవారెను వచ్చిరి దూ
తలు భరతుని దర్శింపగ
మును ముందుగ కేకయరా
జును జూచిరి కైమోడ్చిరి

తదుపరి భరతుని జూచిరి
దండంబులు నర్పించిరి
అంత భరతుడయోధ్యలో
అందరికుశలములడిగెను

అయోధ్యలో భరత ప్రభు!
అందరు కుశలమె - కులగురు
వగు వసిష్ఠ మహాస్వాము
లాన మేము వచ్చినాము.

తమను రాజకార్యార్థము
తత్క్షణమే పిలుచుక ర
మ్మని పంపిరిమమ్ము తమరు
వెను వెంటనె రావలయును

అనిదూతలు విన్నవించు
కొనిరి భరతునకు వారల
యోధ్యలోన జరిగినట్టి
ఉపద్రవము దాచినారు

కులగురుడావిషయంబును
గూఢముగా దాచమనెను
తప్పెరుగని ఆదూతలు
చెప్పినట్లు చేసినారు

భరతప్రభు! గురుదేవులు
బహుమతులను పంపినారు
తమ చేతులమీదుగ తమ
తాతగారికీవలె నని
చెప్పినారు అని దూతలు
చెప్పిరి భరతుడు వాటిని

గొని మాతామహున కొసం
గెను సాదరపూర్వకముగ

వెనువెంటనె భరతప్రభు
తన మాతుల మాతామహు
లనుదర్శించియు వారల
అనుమతిగొని బయల్వెడలె

మాతామహుడిచ్చిన బహు
మతులనుగొని తమ్మునితో
రథమునెక్కి సేనవెంట
రాగ ప్రయాణించినాడు

ఎంతవేగపయనించిన
నేడుదినమ్ములు పట్టెను
ఎనిమిదవ దినాన ఉదయ
మేఅయోధ్య చేరుకొనెను

**వెలరు వాటిన అయోధ్య**

అదిగో! చూడుము సారథి
అట్లెందుకు నిర్మాను
ష్యంబై అగుపడుచున్నది
అడవివోలె మాఅయోధ్య

విశ్వకర్మ దౌహిత్రుడు
వివస్వంతపుత్రుడు మా
మూలపురుషుడును మహితా
త్ముడునగు వైవస్వతమను
చేనిర్మితమగు అయోధ్య
చేవ దప్పి బావుఱుమని
అగుపడుచున్నదదిప్పుడు
అరిష్టమెదొ సూచించెను

అరుణోదయ కాలంబిది
అయోధ్యలో ఉద్యానవ

నాల కాముకులు రాతిరి
వేళల క్రీడించి వేకు
వనె త్వరగా తమఇండ్లకు
చనుటలేదు మునుపటివలె.

సుగంధచందనాగరుల
సువాసనలు జిమ్ముటలే
దిట్టివేళ వాహ్యాళికి
ఎవరు వెళ్లుటనుగానము

మునుపటివలె యిండ్లముందు
ముగ్గులు చిత్రించలేదు
వీణావాద్యాలేమియు
వినిపించుట లేదెందుకొ!

అని ఆందోళిత హృదయుం
డై భరతుడయోధ్యాప
ట్టణములోని కరిగి రథ
మ్మునుదిగి రాట్భవనమేగె

భరతుడు పితృమందిరమును
ప్రవేశించి చూచినాడు
పితృదేవుండచ్చట కను
పించకుండుటను వెంటనె

తన తల్లిగృహంబుజేరి
తల్లిపదములకు మ్రొక్కెను
అంతటామె కొడుకు మూర్ధ
మాదరమున మూర్కొన్నది

నాయన! దూర ప్రయాణము
చే యలసినయట్లుంటివి
తాతగారు మామగారు
తక్కొరులందరు కుశలమె!

భరతుడంత అమ్మాఅం
దరు కుశలమె కానీ అని
అమ్మానేనడుగు దాని
కవశ్యముగ చెప్పవలయు
ఈనీబంగరు మంచం
బేల శూన్యమైయున్నది?

మహారాజుయెప్పుడు నీ
మందిరమందే యుండును
అనినేనిచ్చటికి వచ్చి
తిని వారిటలేరెందుకు?

అంతట కైకేయి రాజ్య
మందు కాంక్షగలదగుటను
అప్రియమును భయంకరము
నగు విషయంబును ప్రియమని
తలచి యేమి యెరుగ నట్టి
తనయుని గనియిట్లన్నది

సమస్తప్రాణులవలె నీ
జనకుడు కాలముదీరి ది
వంగతుడైనాడని యా
వంత వగపు లేకపలికె

**భరతుని విలాపం**

తండ్రిచావు విన్నంతనె
తగనిదుఃఖమున భరతుడు
అయ్యో నేహతుడనైతి
నని ఆక్రందించుచు స్పృహ
కోలు పోయినేలమీద
కూలిపడెను మానువోలె

అంతట కైకేయి దేవి
అతని నేలనుండి లేవ
నెత్తి శరీరము నిమురుచు
ఇట్లని పలికినదప్పుడు

రాజపుత్ర! భరతకుమా
రా! లేవయ్యా! నీవిటు
నేలంబడి యేడ్వరాదు
నీకిది సముచితము కాదు

సర్వమెరింగిన వాడవు
సభాపూజ్యుడవు నీవిటు
లేడ్వరాదు ఏడ్చినందు
కేమి ప్రయోజనముండదు.

మరణించిన వారెవ్వరు
తిరిగిరారుబిడ్డా! నీ
వెంతేడ్చిన ఫలముండదు
ఏడ్వకురా నాతండ్రీ!

కైకేయీదేవి యిట్లు
గారవాననోదార్చిన
భరతుడూరడిల్లకుండ
పలికెనిట్లు తల్లితోడ

అమ్మా! నాయన మనరా
మన్నకు పట్టాభిషేక
మైనను తలపెట్టియుండు
అట్లుగాక యాగమెదో
అయిన చేయదలచియుండు
నని నేభావించి అమిత
హర్షముతో పరుగెత్తుక
వచ్చితినింతటి ఘోరము
వచ్చిపడినదని యెరుగను

రమ్మని కబురంపగనే
రయమున నేవచ్చితి నే

వచ్చులోపలే జనకుడు
స్వర్గస్థుండైపోయెను

వారికి జబ్బేమిచేసె
వారికి అంత్యక్రియలను
సలిపినట్టి రామలక్ష్మ
ణులు పుణ్యాత్ములు నాకా
భాగ్యములేకుండపోయె
పాపాత్ముడ నేనమ్మా!

అమ్మా ఇకనాకు అన్న
అయిన తండ్రిఅయిన బంధు
వైన రాముడొకడే నే
నారాముని కింకరుడను

ఇపుడు నేను వచ్చినట్టు
లెరుగడు నేనతనికి పా
దాభివందనము సేయగ
నవశ్యముగ వెళ్లవలయు

అమ్మా మానాయన శ్వా
సాంతములోపల నాకే
మైన చెప్పినార వారి
అంతిమ సందేశమేమి?

అంత కైక ఉన్నది ఉ
న్నట్లు చెప్పదొడగెనిట్లు
ఓ కుమార! మీనాయన
నాకమేగు సమయంబున

అయ్యో! రామా! సీతా!
అయ్యో! లక్ష్మణ అనివిల
పించుచు తన ప్రాణములను
విడిచినారు ఇంకనువిను

వారు తిరిగి వచ్చినాక
వారి జూడగలుగువారు
ధన్యులు అని పలికెగాని
అన్యమేది పలుకలేదు
అనుచు కైక పలికినంత
ఆర్తుడగుచు భరతుడనియె

అమ్మా రాముడు సీతా
లక్ష్మణయుతుడై యెచటికి
బోయెను యేకారణమున
బోయెనుతెలియగ జెప్పుము

అని అడిగిన యంత కైక
అప్రియమగు వార్తయైన
ప్రియము గూర్చునని తలంచి
వెనువెంటనె చెప్పెనిట్లు

నారచీరలను ధరించి
శ్రీరాముడు సీతాల
క్ష్మణసమేతుడై వెళ్లెను
కారడవుల కనిపలికెను

తండ్రిమరణమునకే తా
తల్లడిల్లిపోవుచు ను
న్నట్టి భరతునకురాముడు
అడవికేగె ననుట విన్న

యంతట దుఃఖోద్వేగము
ఆపలేక అమ్మా! యే
అపరాధముచే రాముడు
అడవికేగ వలసివచ్చె

పరాంగనల కోరడు కద!
పరధనమాశింపడు కద!

పరులనెవరినైన గాని
బాధింపగ లేదుగదా!

సకల వేదములుదెలిసిన
సద్విబుధుని జంపినట్టి
వానిన్ వలె రామునిట్లు
కానకంప హేతువేమి?

స్త్రీచంచలస్వభావమును
దాచలేక యదార్థమును
చెప్పదొడగె భరతునితో
తప్పుడు కైకేయి యిట్లు

పరమమూఢురాలైతా
పండితురాలని తలంచి
సంతసించి భరతుని కిది
సంతోష కరంబగునని
గర్వముతో నుబ్బిపోయి
కైకేయీ యిట్లన్నది

రాముడు నీవాడిన నే
రాలేవియు చేయలేదు
అతడు ధర్మమునుతప్పడు
అకృత్యాలు సేయడెపుడు

తండ్రీ! విను రాముని మీ
తండ్రిగారు యువరాజుగ
పట్టము గట్టుటకొరకై
ప్రయాత్నాలు చేయుటవిని

నేనే మీతండ్రితోడ
నీకు రాజ్యమిమ్మంటిని
అడ్డుతొలగుటకు రాముని
అడవికంపుమని కోరితి

పూర్వమునాకిచ్చినవర
ములకు కట్టుబడి మీనా
యన నాకోరికలు దీర్చ
అంగీకారము దెలిపెను

రాముడు సీతా లక్ష్మణ
సమేతుడై వనికేగెను
ప్రియపుత్రుండగు రాముని
విడిచి పుత్రదుఃఖంబున
పరితపిచుచును దశరథ
ప్రభువు ప్రాణములువిడిచెను

ఓకుమార!ఇది యంతయు
నీకొరకై చేసినాను
ఈ రాజ్యము నీదే నీ
విక సుఖముగ నేలుకొనుము

చిట్టితండ్రి! ఇది సంతో
షించెడి సమయమునీకిది
సంతాపమునకు రవంత
సమయము కానే కాదిది

నీవిక ధైర్యమునుబూని
నిష్కంటక మైన అయో
ధ్యాపట్టణ సామ్రాజ్యము
యథేచ్ఛగా నేలుకొనుము

కొడుకా! ఈ రోజె శాస్త్ర
కోవిదులగు వసిష్ఠాది
సచివులు నీతండ్రికి సం
స్కారములను నీచేతను
చేయింతురు పిదపనీకు
చేతురు రాజ్యాభిషేక

మనినిశ్శంకను పలికిన
దామెయెంతకలగన్నది!

బలిపశువది తనకు వచ్చు
ప్రమాదమును తెలియనిదై
బాగాగడ్డిని మేసిన
పగిది కైక తనకుముందు
సంక్రమించువైధవ్యక
ళంకాదుల తెలిసికూడ
స్వార్థానికి లోబడి బలి
పశువైచెడిపోయెనుగద!
రాజ్యకాంక్ష కైకేయీ
రాణికెంత హానిచేసె
వైధవ్యకళంకపంక
వైతరణిని ద్రోసివేసె!

**భరతుని**
**దూషణారోపణలు**

తండ్రి మరణించె ఆ
తండ్రితో సమమైన
అన్నరాముడు సీత
అనుజులక్ష్మణునితో
వనవాసమునకేగె
వారెవరు లేరంచు
ఏడ్చుదౌర్భాగ్యునకునాకు!
ఎందులకు రాజ్యాలపోకు!

మానాయనను జంపి
మాయన్న రామచం
ద్రునియడవులకు పంపి
నను గద్దెనెక్కు మం
దువు పుండుచేసి అం
దున కారమును జల్లు
నట్లాయె! నిప్పు వని
అరయకను మాతండ్రి
నిను ఒడినిజేర్చు కొన్నాడు
నీకపటమెరుగ కున్నాడు!

నీమూలమున మహా
నీయుడగు మాతండ్రి
దుఃఖమున మరణించె
దుష్టురాలా! నీవు
రమ్యగుణధాముడగు
రామన్న నడవులకు
పంపితివి యెంత రాక్షసివి
పడతికే మచ్చ తెచ్చితివి

తల్లివైతివి యితర
తల్లులును నీవలెనె
తమదు బిడ్డల మీద
మమత వారికి లేద?

అట్లగుట మమతవిడి
ఆతల్లులను పుత్ర
శోకమున ముంచగా
నీకెట్లు మనసొప్పె?

పెద్దమ్మలగు వార
లిద్దరును నన్ను ప్రే
మగ చూచువారు ఆ
మాతృమూర్తుల కెట్లు
హానిచేయగబూని నావు?
అమ్మవైతివినాకు నీవు!

నీకు నేనే రీతి
నిక్కముగ ప్రియమైన
బిడ్డనైతిని, సవతి
బిడ్డలగు రామలక్ష్మ
ణులు సీతయు వారి
జనయిత్రులకు బ్రియము
కాద! వారల నీవు
కానలకు నంపగా
మనసాయె నీకెట్లు?
మాతృమూర్తివి కదా!

తల్లి వైతివి నీవు
తల్లులయెదలు నొవ్వ
చేసితివి నిన్నెంత
ఛీకొట్టెదరు జనులు

రామవిభు తల్లినిన్
సౌమిత్రి తల్లినిన్
సీతతలిదండ్రులను నీవు!
చిచ్చులోబడ నెట్టి నావు!

తనతల్లివలె నిన్ను
తమకమునజూచుచును
సేవించుకొనునట్టి
శ్రీరాము నేరీతి
అడవులకు పంపితివి
అమ్మవైతివి నాకు!

అమ్మవనిచెప్పుకొన
అవమానమగునాకు!
కౌసల్యనిన్నుతన
కడచెల్లెలిగ జూచు
కొనుచునుండెడిదికద

చెనకనేటికి ఆమె
గుండెలను నీవు!
చెనటివౌ నీగుండె
శిల గాకపోవు!

తనతల్లి వలె నిన్ను
తగజూచురామునకు
కినుకరాగలదనుచు
నినువధింపగనుంటి.

జ్యేష్ఠుడే రాజగుట
స్థిర సంప్రదాయమై
వెలసెనీవద్దాని
విరగ గొట్టితివి గద!

రాజపుత్రుడనగుట
రాజ్యంబుపాలించు
శక్తిగలవాడనై
స్వార్థంబుతోనీవు
కాంక్షించునీఆశ
కమలిపోయేటట్లు
నేనురాజ్యంబేల నొల్ల!
నీకోర్కెచెల్లించుటిల్ల!

నినుదుఃఖపెట్టగా
నేనిపుడె వనికేగి
రామునిందోడుకొని
రాగలను పట్టాభి
షేకంబు నాతనికి
చేయించి అతనినే
సేవించుకొనుచుండువాడ!
చిత్తశుద్ధిగ చెప్పువాడ!

క్రూరురాలవు మాతృ
రూపమున శత్రువై

అతిదుఃఖమే కాక
అపకీర్తియును నాకు
కలిగించినట్టి రాక్షసివి!
కటకటా కాలరాతిరివి!

పుట్టినింటికి మరియు
మెట్టినింటికి కళం
కము తెచ్చితివి నీముఖమును!
కనరాదు యెవ్వారలకును!

మావంశము చెరచుటకై
మాపాలిట కాళరాత్రి
వై మాకులసంప్రదాయ
మంత మంటగలిపినావు

పతిఘాతుకి నీసంక
ల్పము నెరవేరదు శ్రీరా
ముని దోడ్కొని వచ్చి అతని
ఘనముగ నభిషిక్తుజేతు

నేనే అడవులకేగుదు
నీవిక నేడ్చుచునుండుము
నీచే నాకాపాదిం
చినపాపము పరిహరింతు

పరమ క్రుద్ధుడై భరతుడు
పామువోలె బుసగొట్టుచు
కైకను దూషించుచు బి
గ్గరగ అరవసాగినాడు

కల్లోలము రగిల్చినది
తల్లియైన సరకుగొనక
పరుషముగా దూషించెను
పరమధార్మికుడు భరతుడు

భరతుని అరుపులకయోధ్య
పరికంపనమొందిన దపు
డా అంతఃపురమంతయు
అదలిపోయినది చలించి.

## భరతుడు కౌసల్యను జూడవచ్చుట

అదిగో! భరతుడు వచ్చిన
యట్లున్నది వానిగొంతు
వినబడుచున్నది వానిని
గనబోవుదమని కౌస
ల్యాదేవి సుమిత్రతోడ
ననుచుండగనే భరతుడు
శత్రుఘ్నునితో బిరబిర
చనుదెంచెను అచ్చోటికి

అంత భరతశత్రుఘ్నులు
ఆత్రముతో కౌసల్యను
కౌగిలించుకొని గొల్లున
గద్గదమున రోదించిరి

కౌసల్యాదేవి అంత
కైక కొడుకుతో నిట్లనె
ఏడ్చెదేల భరతా! నీ
కిది శుభసమయమెకాదా?

నీవుకోరుకొన్నట్లుగ
నిష్కంటకమగు రాజ్యము
నీతల్లి సునాయాసము
గాతగనీకొన గూర్చెను

కానీ నాకొడుకునేల
కానలపాలొనరించెను?

అట్లొనరించుట చేతను
ఆమేకేమి ప్రయోజనము?

క్రూరురాలు ఆమెనన్ను
గూడవెడలగొట్టి తీరు
ఇకనేనె సుమిత్రగూడి
యేగెద నాకొడుకుకడకు

కౌసల్యాదేవి యన్న
కఠినోక్తులు వినభరతుడు
పుండుమీద సూదులతో
పొడిచినట్లు బాధపడుచు,
కైమోడ్చి వినమ్రతతో
కన్నీళ్లను ప్రవహించుచు

అమ్మా! నీవంతమాట
లనకమ్మా! నాకే వృ
త్తాంతము తెలియదు నాపై
అపనిందలు మోపకమ్మ!

**తాను నిర్దోషినని భరతుడు ప్రమాణాలు చేయుట**

రామన్నను అడవికంపి
రాజ్యమేల నేనెన్నడు
కలలోనైనను తలచిన
కపటకర్కశుడను గాను

అమ్మా! రామునిపై నా
కధిక భక్తి కలదని నీ
వెరిగియుండియును నాపై
ఇంతనిందమోపనేల?

అమ్మా! రామన్ననునే
నడవికంప సమ్మతించి
యుండిన శాస్త్రజ్ఞత నా
కుండకుండపోవుగాక!

రాముడన్న నాకెంతో
ప్రాణము నేనతని నడవి
కంపసమ్మతింతునెట్లు
అమ్మా నను నమ్ముమమ్మ!

ఈకుట్రల నేనుండిన
నాకు పుట్టగతులుండవు
ఈదురాశ నాకుండిన
హీనగతులు నాకునొదవు

అన్న నడవికంపగ నే
నామోదించిన యెడలను
పన్నులుగైకొని ప్రజలను
పరిరక్షించని ప్రభువున
కేదుర్గతి బట్టునొ నా
కాదుర్గతి బట్టుగాక!

అమ్మా ఈకుట్రకు నే
సమ్మతించి యుందునేని
ఉపకారికి నపకారము
నెపమనకను సేయువాని
కే పాపముకలుగునొ నా
కాపాపము కలుగుగాక!

అన్నను నేనడవికంప
అనుమతించియుంటినేని
అతి సంతతితో దరిద్ర
మనుభవించుచును జ్వరాది
రుగ్మత పీడితుడనగుచు
రోదించుచునుందుగాక!

క్రతువు ధక్షిణాది ధర్మ
కార్యాలకు ధనమిచ్చెద
నని అవలనిచ్చెదనని
అనృతమాడి యేమీయని
మనుజునకే పాపముకలు
గునొ నాకాపాపమంటు!

ఈపాపపు పనిలో నా
కేమాత్రము పాలుండిన
ఘోర రౌరవాది నరక
కూపములో కూలిపోదు.

అని కఠోర ప్రమాణమ్ము
లాభరతుడు చేయుచు దుః
ఖాతిశయములో విసజ్ఞు
డై నేలంబడి పోయెను

అప్పుడు కౌసల్యకు విష
యంబంతయు అవగతమై
భరతుడెంత పవిత్రుడని
పరమానందముజెందెను

భరతా! నీవును లక్ష్మణు
వలె ధర్మమునకు బద్ధుడ
వై సత్పురుషులు వెళ్లెడి
అమరలోకములకేగుదు

వని భరతుని దీవించెను
మనసారగ రామజనని
అప్పుడు భరతుని మనస్సు
విప్పారుచు కుదుటపడెను

**భరతుడు దశరథున**
**కుత్తర క్రియలుసలుపుట**

భరతుడిట్లు ఏడ్చుచుండ
పవలంతయు గడిచిపోయె

అట్లాగే రాత్రంతయు
నిట్టూర్పుల ముగిసిపోయె

అరుణోదయమయ్యెను కుల
గురుడు వసిష్ఠుడు వచ్చెను
భరతా! నీ జనకున కు
త్తరక్రియలను సేయుమనెను

అంతభరతుడట్లాగే
అని సంసిద్ధంబయ్యెను
ఆలస్యమొనర్చకుండ
అపరక్రియలొనరించెను

దశరథుని కళేబరమును
తైలద్రోణి నుండితెచ్చి
స్వర్ణపీఠిపై నునిచిరి
స్నానాదుల గావించిరి

హోమాదులొనర్చి శవము
నునిచిరి పల్లకిలోపల
వెండి పసిడి నాణెములను
వెద జల్లిరి మార్గంబున

శ్మశానవాటి కరు దెంచి
శవమును చితిపై పరుండ
బెట్టి అగ్నిముట్టించిరి
పిదప మంత్రములు జదివిరి
ప్రేతముపూర్తి దహించిన
పిదప అందరును సరయూ
నదికి వెళ్లి నివాపాలు
ఉదకముతో వదలినారు

ఆశౌచము పది దినాల
అనంతరము వదలిపోయె

పదకొండవనాడు మరియు
పన్నెండవనాడు యధా
శాస్త్రవిధిని శ్రాద్ధ కర్మ
చయములన్ని పూరించిరి

మృతునకు నుత్తమలోక
క్రియనుద్దేశించి బ్రాహ్మ
ణులకు పుష్కలముగ దాన
ములనొసగెను భరతవిభుడు

పదమూడవ రోజుదయమె
భరతుడు దహన ప్రదేశ
మునకు వెళ్లి అస్థిసంచ
యనము పూర్తి చేసినాడు

ఆవ్విధి ఋత్విజపురోహి
తాచార్యులు యధాశాస్త్ర
ముగను అపరకర్మలన్ని
పూర్తి నొనర చేయించిరి

## ఉపశాంతి వాక్యములు

భరతశత్రుఘ్నులు ఇర్వురు
పరమదుఃఖమున మిక్కిలి
విలపించుచునుండగ వా
రల వసిష్ఠుడోదార్చెను

శోకమోహజరామరణ
క్షుత్పిపాసములుమూడును
సర్వ ప్రాణులకు గలవివి
స్వాభావికములు వీనిని
నివారింప నలవిగాదు
నిజమిది దుఃఖిచవలదు

సమస్త భూతములకు నిల
జన్మ మరణములు స్వాభా
వికములు అనివార్యంబులు
విలపించిన లాభమేమి?

అని వసిష్ఠుడును సుమంత్రు
డును బోధించుచు రఘుసో
దరులను ఆశ్వాసించిరి
తప్తమనము ఉపశమింప

## మంథరకుతన్నులు

అపుడు మంథరమ్మ సమ
స్తాభరణాలంకృతయై
వచ్చినిల్చినది కులుకుచు
భవనద్వారము ముంగట

ద్వారపాలకులు దానిని
పట్టుక శత్రుఘ్నుకుమా
రునకు నప్పగించుచు ఇ
ట్లని పలికిరి అయ్యా ఈ
గూనిదాని వలనయింత
ఘోరము జరిగినది దీని
శిక్షించుట మీవంతని
చెప్పిరంత శత్రుఘ్నుడు

పట్టరాని కోపముతో
బలాత్కారముగ దానిని
పట్టుక జరజర యీడ్చుచు
పాదతాండవముచేసెను

అంతట అది బిగ్గరగా
అరవసాగినది భవనం

బంత దద్దరిల్లె దాని
అరుపులతో నిండిపోయి

భయగ్రస్తలైన దాని
పరిచారిక లందరు కొ
సల్య చాటుకేగ, కైక
జడసి భరతు వెనుక జేరె

ఎన్నిపాపములు చేసిన
ఇంతిని చంపగ రాదని
వారించెను శత్రుఘ్నుని
భరతకుమారుడు విబుధుడు
ఈ కైకను నేనే వధి
యించియుందుకానీ మన
అన్నయ నను స్త్రీ ఘాతుకు
డని నాముఖమే చూడడు

అబలను వధియించితిమని
అన్నయ మనతో మాట్లా
డడు నిశ్చయమిదిరా త
మ్ముడ! దానివధించవలదు

భరతుని మాటలువిని కో
పము చాలించిన వాడై
శత్రుఘ్నుండా కుమతిని
చంపకుండ విడిచిపెట్టె

శత్రుఘ్నుని తన్నులకు వి
సజ్ఞయగుచు వలను జిక్కి
వెరపుజెంది నలుదిక్కుల
వీక్షించెడి క్రౌంచివోలె
ఏడ్చుమంధరనుగని ఓ
దార్చె కైక మెలమెల్లగ

**వసిష్ఠాదులతో భరతుడు**
**రాముని దోడ్కొని వచ్చెదననుట**

పదునాల్గవనాడుదయమె
వసిష్ఠాది మంత్రివరులు
భరతుని దగ్గరకు వచ్చి
ప్రార్థించిరి ఈ విధముగ

నాన్నగారు మరణించిరి
అన్నగారు వనికేగిరి
భరతా! నీవిక వెంటనె
పట్టంబును గట్టుకొనుము

రాజులేని రాష్ట్రమంద
రాచకమ్ము చెలరేగును
కనుకను రాజ్యాభిషేక
మును నీవికచేసికొనుము

అచటికిగొని తెచ్చినట్టి
అభిషేకపదార్థాలకు
ప్రదక్షిణించియుభరతుడు
వారందరతో నిట్లనె

రాముడు జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు
రాజ్యమేలుటకు అర్హుడు
ఇది మావంశాచారాము
ఇది మానుట అపచారము

ఈఅపచారము చేయుట
కేమాత్రము సమ్మతించ
లేనిక నేనేరీతిగ
ఈనీతిని భంగపఱుతు

పదియునాలుగేండ్లడవిని
వాసమునేసేయగలను

అడవికిపుడెవెళ్లి నేను
ఆరాముని గొనితెత్తును
చతురంగబలాలతోడ
సత్వరమేవెళ్లవలయు
నావెంటను మీరందరు
రావలయును ఈసమస్త
సంబారాలను గైకొని
సత్వరమేరావలయును

అన్నకడవిలోనే రా
జ్యాభిషేకమొనరజేసి
అతనినిటకుగొని తెత్తును
అనిభరతుడువచియించెను

భరతుని మాటలకందరు
పరమానందముజెందిరి
వెంటనెభరతుడు బయ
ల్వెడల నిశ్చయించి నాడు

ముందుగపనివాండ్లమార్గ
ములను బాగుసేయుటకై
పంపి పిదప వేకువనే
పయనముగట్టెను భరతుడు

## భరతుని ప్రయాణము

అమ్మలుముువ్వరునువసి
ష్ఠాది ప్రముఖులును సేనా
బలములు వెంటనురాగా
భరతుడపుడు బయల్వెడలె

వారందరు గంగగట్టు
జేరుకొనిరి శృంగిబేర
పురసమీపమది అచ్చట
భరతుని సైన్యంబాగెను

ఆరాతిరికచ్చోటనె
ఆభరతుడు విడిదిసేయ
దలచివేకువనె గంగను
దాటివెళ్లదలచినాడు

మాతండ్రికి ఈగంగా
మంగళజలములతో త
ర్పణములు వదలుదునటంచు
భరతుడట్లు గావించెను

అపుడాగంగా తీరము
నందు సేనలన్నిటికిని
తక్కిన పరివారానికి
తగువిడుదులునేర్పరచిరి

## భరతుడు గుహునిజూచుట

గంగానది గట్టుమీద
ఘనసేనలు విడిదిసేయు
టెఱిగి గుహుడు తనవారల
త్వరితముగా బిలిచిపలికె

కైకకొడుకు భరతుడిపుడు
కడగి మహాసేనలతో
వచ్చినాడు శ్రీరాముని
వధియించగ గాన మీర

లందరిపుడె గంగానది
కడ్డముగా సైన్యముతో
ఓడలపై సిద్ధముగా
నుండవలయు నెదుర్కొనగ

ఒక్కొక ఓడకు నూర్గురు
యుద్ధనిపుణులగు వారలు

ఉండవలయు నైదునూర్ల
యోడలందు రక్షణగా

రిపుసేనల దాటనీక
రేవును కాపాడు కొనుచు
ఐదునూర్ల ఓడలపయి
అడ్డుకొనగ నుండవలయు

అనితన వారలకు గుహుడు
ఆజ్ఞలిచ్చి భరతుకడకు
చనుదెంచి నమస్కరించి
మనసులోని మాటబలికె

భరతేశా! నీకు రాజ్య
పదవినిచ్చి మునివృత్తిని
వనినుండగ రామవిభుని
పై దండెత్తగ పోదువె?

నేను రామవిభు బంటును
నిన్ను నేను గంగదాటి
పోనీయను నాబొందిని
ప్రాణములున్నంత వరకు

నీతో పోరాటమునే
సేతును నాప్రాణమ్ములు
బొందిని వీడిన పిదపనె
పొమ్ము రామవిభుని మీద

అని రోషంబున బల్కెను
ఆవృద్ధ గుహాఖ్యు డెంత
ప్రాణమిత్రుడా జటాయు
పగిది యెంత మహనీయుడు!

గుహుడాడిన మాటలు యెద
గ్రుచ్చుకొనగ బాధపడుచు

భరతుడిట్లు గుహుని తోడ
పలికెను విమలాత్ముడగుచు

రాముడు నాకగ్రజుండు
రాజగుటకు నతడర్హుడు
అతనిని ప్రార్థించితెచ్చి
అయోధ్యకు ప్రభువును జేయ
పోవుచుంటి నీవిట్లు అ
పోహపడుట తగదు మేలు
లో కీడును భావించిన
లాగున ఇట్లాడవలదు

అంతభరతు చిత్తమెఱిగి
ఆగుహుడతనికి వన్యము
లైన వస్తువుల బెక్కుగ
కానుక లర్పించి యలరె

భరతుని గొనిపోయి రామ
ప్రభువువిడిన చోటుచూపె
ఇనకులుడిట జడలు గట్టి
ఇచ్చట శయనించెననుచు

భరతుడు అచ్చోటులగని
పరితప్తుండై బొగులుచు
తానును తమ్ముడును జడలు
ధరియించిరి మునులట్లుగ

మరునాడుదయమెభరతుడు
పరివార సమేతముగా
గుహుడేర్పరచిన వందల
కొలది ఓడలెక్కినారు

స్వస్తికమను ఓడలందు
భరతుడు తమ్మునితో త

ల్లులతో మంత్రులతో ప్రము
ఖులతో నధిరోహించెను

సేనాపరివారంబులు
నానారకముల నావల
పైనను అధిరోహించియు
భాగీరథిదాటినారు

## పంచమాశ్వాసము

### భరతుడు భరద్వాజాశ్రమము జేరుట

చెంబడి వారలసాహ
య్యంబున గౌతమిని దాటి
భరతుడు తనవారలతో
ప్రయాగ వనమును జేరెను

ఆవనమందున సేనల
నాపి వసిష్ఠుని ముందిడు
కొని భరతుడు భరద్వాజ
మునివరు దర్శించవెడలె

ఆ వసిష్ఠుగని నంతనె
అర్ఘ్యము తెమ్మని చెప్పుచు
లేచివచ్చి భరద్వాజు
డాచరించె అభివాదము

భరద్వాజమునివరునకు
భరతుడు ప్రణమిల్లె భక్తి
ఇతడు భరతుడని వసిష్ఠు
డెరుకపరిచె మునివరునకు

భరతవసిష్ఠులకు నర్ఘ్య
పాద్యంబుల నిడిన పిదప
పరస్పరము వారు కుశల
ప్రశ్నంబుల నడిగినారు

భరతా! నీ వీసేనా
బలములగొని నీవాముని
వృత్తి నడవులందునుండు
ఉత్తముడగు రాముని కే
యపకారము సేయవుకద!
అనిమహర్షి ప్రశ్నించెను

మునివరుడాడిన మాటను
విని భరతుడు మిగులబొగిలి
కన్నుల నీర్గ్రమ్మకొనగ
విన్నవించె మునివరుతో

భగవాన్ మీరును నను ఇ
ప్పగిది దోషిగా తలచిన
హతుడనైతి సర్వజ్ఞులు
నగు మీరిట్లాడతగునె?

నాకు తెలియకుండగనే
నాతల్లి యొనర్చినట్టి
కార్యమునకు బాధ్యుడనే
కాను నేనునిర్దోషిని

రాముని ప్రార్థించి అతని
రాజ్యమూనుమని చెప్పగ
బోవుచుంటిగాని వేరు
భావంబున బోనుదేవ!

అనిభరతుండాడుమాట
విని మహర్షి సంతసించి
భరతా! నీసేనాపరి
వారముతో మేమొసంగు
విందునారగింపు మనుచు
వినతిచేసె ప్రేమతోడ

## భరద్వాజుని అద్భుత విందు

భరతుని అంగీకారము
బడిసినపిమ్మట మహర్షి
అగ్నిహోత్రగృహంబరిగి
ఆచమించి ధ్యానించెను

నేను భరతునకు నాతని
సేనలకును ఆతిధ్యం
బీయనెంచితిని గృహములు
విశ్వకర్మ వినిర్మించు
గాక! యనుచు సంకల్పము
గావించెను - ఆపిమ్మట

యమ వరుణ కు బేరమహేం
ద్రాది దేవతల దిక్పా
లకుల దేవజాతి అప్స
రసల బిలచి మీరందరు
నాకు సహాయ్యము సేతురు
గాక! యనుచు ధ్యానించెను.

ఆ మహర్షి ప్రాఙ్ముఖుడై
ఆసనమున గూరుచుండి
కరములు మోడిచి శిక్షా
స్వరమున జెప్పుచు దేవత
లను బిలచిన యంతవార
లందరచట జేరుకొనిరి.

మునిసంకల్పించినంత
టనె ఆయా దేవతలును
ఆయాయేర్పాటులన్ని
అనుక్షణమె సమకూర్చిరి.

శరత్కాలమేఘుంబుల
చందంబున ధవళంబగు
భవనములావిర్భవించె
పంచయోజనముల వరకు.

పుష్పవర్షములు కురిసెను
భోగద్రవ్యములు గుమ్మని
పరిమళములు విరజిమ్మెను
పవనుడు హాయిగ వీచెను.

అచ్చరలాడిరి గంధ
ర్వాంగనలును మధురముగా
గానాలాపన చేసిరి
వీణియలను వాయించిరి

దివ్యదుందుభులు సమస్త
దిక్కులందు వినిపించెను
మంగళ వాద్యములుమ్రోగె
మలయమారుతము వీచెను

చక్కని తోరణములతో
చతుశ్శాల భవనంబుల
రమ్యహర్మ్యముల మధ్యన
రాజగృహంబొకటి వెలసె

భరద్వాజముని ఆనతి
భరతుడందు ప్రవేశించి
అందుమధ్యరాజార్హం
బైన దివ్యసింహాసన
మునుగని, రామార్హంబది
యని దానికి ప్రదక్షిణము
చేసి మ్రొక్కి చామరమును
చేతబూని ప్రక్కనున్న
ఆసనమున గూర్చుండెను
అమాత్యులును గూర్చుండిరి.

భరతుని మనసెరుగుటకై
భరద్వాజుడీ పరీక్ష
చేసెను భరతుండందున
సిద్ధహస్తుడని తేలెను

భరద్వాజు నాతిథ్యము
పరమ వర్ణనాతీతము
భరతసేన ప్రమత్తయై
స్వర్గమిదేయని పలికెను

తృప్తిగ భోంచేసి మధువు
తృప్తిగ గ్రోలిన వారై
తూలిపోవుచును తమచే
తులను అప్సరసలు బట్టు
కొని వెంబడిరాగ సైని
కులు ఇట్లని వాగాడిరి

పోముమేమరణ్యమునకు
పోము మేమయోధ్యకు నిక
అడవియందురాముడు సుఖ
పడునుగాక! భరతుడయో
ధ్యను సుఖముగనుండుగాక!
ఆ యిర్వురు యెట్లైనను
పోని మేము దీని విడిచి
పోమెచ్చటికైనగాని

తమకు విభుడులేడనుకొని
తాము స్వతంత్రులమనుకొని
ఇదే స్వర్గ మిదే స్వర్గ
మింతకన్న వేరు స్వర్గ
మేయుండదు అనికేకలు
వేయుచు సంతోషంబున
ఆడుచుపాడుచు నవ్వుచు
అటుఇటు పరుగిడుచుండిరి

కడుపునిండ తినియుండియు
కమ్మగఉందని ఇంకను
తినగోరియు కడుపుపట్ట
దని దుఃఖించిరి సేనలు

వామ తిందువా! అనిఒక
భామ సరసమున బలుకగ
వామెందుకె సోమతేవె
భామా! అనిసైనికుడనె

మనుషులెకాదా విందున
మదినలరినయట్టి గజతు
రంగాదులు గూడ మిగుల
పొంగిసుఖాబ్ధిని దేలెను

ఒకచో మైరేయము వే
రొకచో సారాయము ఇం
కొకచో పాయసములు నో
రూరునట్లు ప్రవహించెను

మాంసంబులు వ్యంజనములు
మద్యంబులు మధురమధుర
ఫలరసములు స్వర్ణరజిత
ప్రాతలందునిండియుండె
అమృతమువలె లభియించిన
అన్నమును యధేష్టముగా
తినియు తృప్తిజెందకమరి
తినసాగిరి వారందరు

ఆభరణాలంకృతలై
అప్సరసలువేలకొలది
వచ్చిరి భరతుని ముందట
పాడిరి నాట్యము చేసిరి

స్పర్శమాత్రమున పురుషుని
పరవశింప జేయునట్టి

సుందరాంగనలు సేనల
సుఖపెట్టుటకై వచ్చిరి

నారద తుంబుర గోపులు
నాదమూర్తులరుదెంచిరి
పరమభాగవతోత్తముని
భరతుని ముందట పాడిరి

సైనికులారా! ఇదిగో!
సారాయము కావలయున!
త్రాగినంత ఇవ్వగలము
తనివితీర త్రాగండీ!

ఇదిగో! మాంసాహారము
ముదమారగ భుజియింపుడు!
అనికొందరు వన్నెలాండ్రు
అవ్వారల వెంటబడిరి

ఒక్కొక సైనికుని కొంద
రువిదలు తలయంటి, ఒళ్లు
పట్టి, నలుగుపెట్టి, స్నాన
ఘట్టములకు గొనిపోయిరి

చక్కని యువతులు కొందరు
ఒక్కొక సైనికునికి గో
ర్వెచ్చనైన నీటితో య
థేచ్ఛ స్నానమాడించిరి

మరికొందరు మదయువతులు
మైతడియారంగ తుడిచి
అలంకరించి యేకాంత
మందున గొనిపోయి పర
స్పరము సురాపానమ్మును
సరసమొలక చేయించిరి

నందనవనమందు సురలు
నానాక్రీడల దేలిన
పగిది భరతసైనికులును
పలు క్రీడల దేలుచుండ
ఆరాతిరి గడిచిపోయె
అంతట తెలవారిపోయె!

**భరద్వాజాశ్రమమును భరతుడు వీడుకొనుట :**

భరతుడు వేకువనెలేచి
భరద్వాజ మహర్షి ద
గ్గరకు వచ్చి సవినయముగ
కై మోడ్చి నమస్కరించి

భగవాన్! నేనును నాపరి
వారమంతయును మీ ఆ
తిథ్యమునకు తృప్తులమై
తిమి ఇకమిమువీడ్కొనెదము

అగ్రజు శ్రీరాముని జా
డగబోవుచునున్నాడను
అతడుండెడి ఆశ్రమంబు
అరయజెప్పుడని అడిగెను

**చిత్రకూటాద్రికి దారి**

భరతా! ఇచటికి రెండు
న్నర ఆమడదూరములో
వనములుగల చిత్రకూట
మను పర్వత మొకటున్నది

దానికుత్తరమునకు మం
దాకినియను నదియున్నది
ఆనదికిని దక్షిణమున
ఆశ్రమమదిఒకటున్నది

గాననీవు దక్షిణదిశ
గాదూరము పోయిపోయి
నిరుతి దిశలసేనల పో
నిమ్మచటనె రాముడుండు

రామాశ్రమమేగుజాడ
ఆమౌనీంద్రుడు చెప్పెను
అపుడా ముగ్గురు తల్లులు
ఆమహర్షి కడకు వచ్చి
అభివాదము చేసిరి అపు
డామహర్షి ప్రశ్నించెను

**తల్లులపరిచయం**

భరతా! ఈతల్లులెవరు
అరయనాకు జెప్పుమనగ
భరతుడంత వారిగూర్చి
పరిచయమీవిధి చేసెను

తెల్లబారి శుష్కించిన
దేహముతో దుఃఖించుచు
దేవతవలె గనుపించెడి
దేవి ఈమెనాజనకుని
కగ్రభార్య పురుషోత్తము
డగు రాముని కన్నతల్లి
ఈయమయే పట్టమహిషి
ఈమెను కౌసల్యయండ్రు

అడవిని పూలన్నిరాలి
పడిన కొండగోగువోలె
తెల్లబారి కౌసల్యా
దేవియెడమ భుజము పట్టు
కొన్నది ఈమెయె సుమిత్ర
కన్నది అశ్వని కుమారు

లను బోలిన తనయుల ల
క్ష్మణశత్రుఘ్నులను వారల

ఓమహర్షి! ఎవతె వలన
రామలక్ష్మణులు సీతయు
వనముల పాలయిరొ ఎవతె
వలన మహాత్ముడు మాజన
కుడు వగ మరణించెనొ ఆ
క్రూరురాలు ఆ అనార్య
కైకేయీదేవి ఈమె
నాకు తల్లి అని కన్నుల
నశ్రులు గార్చుచు గద్గద
మదర పలికి నిట్టూర్చెను

దోషరహిత! నీతల్లిని
దూరనేల శ్రీరాముని
వనవాసము వలన సకల
జనులకు కల్యాణమగును

కానదైవ ప్రేరితమయి
కైకేయీ దేవి యట్టు
లనియె కాని వేరుకాదు
అనుచు భరద్వాజుడనియె

కైకలేక రామాయణ
కావ్యమ్మది లేదుకదా!
కీడెంచియు మేలెంచను
వాడుక పదమున్నది కద!

భరతేశుండంతభర
ద్వాజమహర్షిని వీడ్కొని
సేనా పరివారముతో
చిత్రకూట మేగ వెడలె

**సేనాపరివారంతో భరతుడు**
**చిత్రకూట మేగుట**

వనధివంటి మహాసేన
వానకాలమందు మేఘ
మాకాశము నావరించి
నట్లు భూమినావరించె

అతివేగంబున పరుగిడు
అశ్వగజాదుల చేతను
గప్పబడుట చేత భూమి
గనపడకుండగ బోయెను

అట్లుసేనతో భరతుడు
అడవిసాగిపోయిపోయి
చిత్రకూటగిరి ప్రాంతము
చేరువలోనికి వచ్చెను

ఆవైపున ధూమశిఖలు
అంబరమెగ బ్రాకుచుండె
ఆపరిసరమందే రా
మాశ్రమంబు వెలసియుండు

నని భరతుడు పరమానం
దానుభూతినొందుచు తహ
తహలాడుచు శ్రీరాముని
దర్శించగ వేగిరపడె

ఆసమయమునందె రాము
డవనిసుతను గూడి చిత్ర
కూటాద్రిని విహరించుచు
చాటువలర భాషించెను

**చిత్రకూట వినోదాలు**

అవనిసుత! చిత్రకూ
టాద్రి సొగసులజూచి
నారాజ్యమది పోయె
నామిత్రులకు దూర
మైతినను బాధ నాలోన
అవంతయును లేదుచాన!

పరమరమణీయమగు
ప్రాంతమగు యీగిరి
ప్రాంతంబులో మనకు
లక్ష్మణుడు తోడుగా
నున్నచో ఇచట నే
యెన్ని ఏండ్లయిననూ
సుఖముగా గడుపగలవాడ!
శుభగాత్రి నేను నీతోడ!

వనజాక్షి! నాకు యీ
వనవాస వ్రతము చే
రెండు ఫలములు గలగు
తండ్రి ఋణమును దీర్చు
కొనుటొకటి, రెండవది
అనుజునకు హితమిడుట
ఇంతకన్నను నాకు సఖియ!
ఏమి కావలె చెప్పు చెలియ!
జలజాక్షి! ఇటమునుల
సాంగత్యమున క్రూర
మృగములగు వ్యాఘ్రములు
మృగసమూహము గూడి
శాంతమున తిరుగాడు
చందమును వీక్షించ
దుష్టులకు హింసించు
దుర్గుణము మాన్పించి
సహజీవనములోని
సౌఖ్యపథమును జూపు

సాధుజన సాంగత్య మహిమ!
శౌరి కైనను పొగడ వశమ!

పులిఆవు లొకచోట
జలము గ్రోలుచునుండె
హరిగజములొకచోట
అటలాడ్కొను చుండె
ముంగియు భుజంగాలు
ముచ్చటాడుచునుండె
సాధుజన సాంగత్య మహిమ!
శౌరి కైనను పొగడ వశమ!

నింగినేలనుదాక
వంగివచ్చినయట్లు
కలవాడు నిరుపేద
చెలిమిగోరినయట్లు
సహజీవనము నేర్పు
శాంతిమార్గము జూపు
ఈమునుల సాంగత్యమహిమ!
ఎన్న శేషునకైన తరమ!

కల్యాణి! అటుచూడు!
కమలాలు విప్పారె
వాటిపైతుమ్మెదలు
వాలిమధువునుగ్రోలి
మత్తిల్లిమైమరిచి
మధువివశలైపోయె
మధుమతీ! నీచెంతలోన!
మత్తిల్లి మైమరచిపోన!

రమణీయమగు గిరి
ప్రస్థముల గిన్నరులు
జంటలుగ జంటలుగ

సరసానురాగభో
గాలక్రీడించుటనుజూడ!
గగురుపాటొందించుప్రోడ!

పలుపుష్పములతోడ
పలుఫలంబులతోడ
పలురకములైన ప
క్షులతోడ పరమసుం
దరములగు శిఖరముల
తనరు ఈపర్వతము
నందు నామనసెంతొ చెలియ!
అలరారుచున్నయదిసఖియ!

చెలి! మనోవాక్కాయ
ములవశముచేసికొను
మలయానిలము కోకి
లలరవములును పుష్ప
ఫలములును గలిగిశో
భిలునట్టిఈ చిత్ర
కూటగిరిపైనన్ను
గూడియుండుటనీకు
సంతోషముగనున్నదవున?
సఖియ! ఈవనజీవనమున!

కమలాక్షి!కాముకులు
కామకేళిని దేలు
సమయమునవారిగే
హములరాపిడిచేత
నలిగిపోయినతామ
రలదండలను చూడు!

పలురకములైన ఫల
ములనుదిని గింజలను

మొట్టిలను భువివదలి
పెట్టి నారలు చూడు!

కోమలీ! చూడు ఆ
గుహనుండివచ్చు గా
లులు వివిధపూలతా
వులు గుబాళించుచును
ఘ్రాణేంద్రియంబునకు
కడుసౌఖ్యమునుగూర్చు!

మదముగార్చుచునున్న
మదగజమువలెకొండ
స్రవియించుసెలయేళ్ల
జలముతోశోభిల్లు!

జనకజా! నినులక్ష్మ
ణునిగూడియిచ్చోట
ఎన్నిఏండ్లైననూ
ఉన్ననాకేమాత్ర
మింతదుఃఖముతోచ
దిది నిశ్చయముదేవి!

లలితాంగి!నీతోడ
లక్ష్మణునుతోగూడి
ఇచటవిహరించుచును
ఈపదియునాల్గేండ్లు
గడిపి సంతుష్టునై
కడకయోధ్యకుచేరి
పాలనాకర్తవ్య
భారమూనెదననుచు
మురిసిపోవుచు రామవిభుడు!
ముచ్చటించెను సీతకపుడు!

## మందాకినీ విహారాలు

చిత్రకూటాద్రిపై
చిత్రముల జూపించి
సీతతో మందాకి
నీతటిని జేరుకొని

ఆనదీసౌందర్య
మవనిసుత కిట్లువ
ర్ణించి చెప్పగదొడగె
ప్రేమతో రాఘవుడు

జానకీ ఇటుచూడు!
స్వచ్ఛజలములు గల్గు
మందాకినీ నదీ
మంగళాకారమును

సైకతమ్ములునివి
శాలోన్నతములైన
ఘనజఘనసీమవలె
తనరారుచున్నయవి

హంసకారండవవి
హంగాలకూజితాల్
నీనూపురధ్వనుల
గానమటుశోభిల్లు

కమలోత్పలాలునీ
కరచరణవదనముల
వలెనెంతముచ్చటగ
విలసిల్లుచున్నయవి

స్వచ్ఛజలములుగలిగి
జలవిహంగాలతో
రంగురంగులపుష్ప

రాజితో ఈనది కు
బేరుసరసినివోలె
సొరొంద నలరారు

జడలురాలిచి జింక
చర్మములవల్కలము
లనురాల్చి ఈవేళ
మునులు అవగాహన
స్నానముల చేయుచు
న్నారు ఈనదిలోన

మునులు కొందరుస్నాన
మును చేసిసూర్యునకు
అర్ఘ్యమిడుచున్నారు
అత్యంత భక్తితో

ఋషులుకొందరుచేతు
లెత్తి సూర్యునకుప
స్థానమును నిష్ఠతో
సలుపుచున్నారిపుడు

నృత్యమ్ము చేయబో
యెడి నర్తకులుచేతు
లెత్తిపుష్పంబులను
ఎగజల్లినటుగిరిని
గాలికింగదులు వృ
క్షాలుఈనదిచుట్టు
వెదజిల్లుచుండు పుష్పములు
ముదమొదవుప్రకృతిదృశ్యములు

ప్రియురాల! చూడు గా
లికిరాలిపుష్పములు
కొన్నితీరములందు

కొన్నిజలములయందు
బడి కదలి పోవుటను
పరికించి చూడగా
ప్రియునిచే సగమపహ
రింపబడి నట్టి వ
స్త్రము ధరించినవారితీరు!
భ్రమియింపజేయు ఈయేరు!

నిష్కల్మషులు తపో
నిష్టులును శాంతికా
ముకులు సిద్ధులు స్నాన
మొనరించుటను కలం
గిన జలంబులు గలిగి
తనరు ఈపుణ్యనది
జలములో నీవు నాతోడ!
సలుపరావే జలక్రీడ!

మూడుపూటల స్నాన
మాడుచును తేనెతో
ఫలమూలములదినుచు
వైదేహి! నినువిడక
యున్నచో నాకాయ
యోధ్యయెందుకు రాజ్య
పాలనా వైభోగ
భాగ్యమదియెందులకు?

మహిజ! ఈయాశ్రమము
మహిమచే జాతివై
రముమాని కరులు సిం
హములౌ క్కచోగూడి
జలముగ్రోలిన గట్లు

గలిగి పూబరువుచే
వంగిపోయినకొమ్మ
లుంగలిగి నట్టి వృ
క్షములతో నలరు ఈఝరిణి!
సంతసింపగ జేయ దేవని!

మందాకినీనదీ
సౌందర్యములగూర్చి
సీతతో వర్ణించి
చెప్పుచును కొండనె
త్తములందు తమనివా
సముజేరికూర్చుండి
పలువిధములగు మాంస
ములను చెలియకుదిని
పించగా దొడగెరాఘవుడు!
ప్రియవచోక్తులతోడనపుడు!

**భరతుని ఆగమనం**

గగనమ్ము దాక దు
మ్మెగసి చెలరేగినది
భీకరధ్వని దిశల
పిక్కటిల జేసినది

ఆభీకరధ్వనికి
అడలెత్త జంతుమృగ
పక్ష్యాదులును దిశల
పరుగులను దీసినవి.

అదిజూచి రాఘవుడు
అనుజులక్ష్మణుబిలచి
ఈధూళి రేగుటకు
ఈభీకరధ్వనికి
కారణంబేమిటో

కనగొనుమటంచనియె

తత్క్షణమె లక్ష్మణుడు
తరువెక్కి నలుదిశలు
పరికించి చూడగా
భరతసైన్యములుత్త
రమునుండి వచ్చుటను గనెను
రఘువరునితో నిట్టులనెను

అన్నయా! చూడుకై
కమ్మ కొడుకిపుడు మన
పైకిరథగజతురగ
పదాతులతో గూడి
దండెత్తి వచ్చుచున్నాడు!
తల్లిప్రేరణచేత వాడు!

తల్లివరములచేత
తగపట్టమును గట్టు
కొనియు నంతటితోను
తనయకను నిష్కంట
కమగు రాజ్యమును మది
కాంక్షించి మనల జం
పుటకునై యిప్పుడి
చ్చటికి వచ్చుచునుండె
ఇది నిశ్చయము రామ చూడు!
ఇకవధ్యుడగునాకు వీడు!

ముందుగా నపకార
మును చేసినట్టి పా
పాత్ములను వధియించు
టది అధర్మము కాదు
కనుక ఈక్షణమె వీ
నినిసేనతో గూడ

నిహతుగావింతు నా
నిశితశరములతోడ

అగ్రహావేశమున
నిగ్రహము కోల్పోయి
సమరయత్నయుసేయు
సౌమిత్రి కోపమును
చల్లార్పగా రామ
చంద్రుడిట్లని పలికె.

ఏప్రేరణలేక భరతు
డిటకు మనలజూచుటకై
వచ్చుచుండె నేని వాని
వధగావించుటదెందుకు?

నీకుగాని నాకుగాని
నెనరు వీడి ఎప్పుడైన
అపకారముచేసినాడ
అనుజా! లక్ష్మణ! చెప్పుము

భరతునిహృదయమ్మును నే
నెరుగుదు వాడిపుడు మనకు
కలిగిన కష్టమువిని సం
కటపడి మనలనుజూడగ
అరుదెంచుచున్నాడని
అనుకొందును లక్ష్మణా!

జనకాజ్ఞను రాజ్యముభర
తునకొసంగి వనికి వచ్చి
ఇపుడు వానిజంపిరాజ్య
మెవనికిత్తు చెప్పుమయ్యా!

సోదరులను జంపి స్వర్గ
సుఖములనైనను కోరను
భ్రాతృహాని చేసియెట్టి
భాగ్యమైన నేనొల్లను

రాజ్యకాంక్షనీకుండిన
లక్ష్మణ చెప్పుము భరతుని
అడిగెద రాజ్యము నీకి
మ్మని అందుకువాడువెంట
నే రాజ్యమునీకిచ్చును
నిశ్శంశమముగ నిజమిది

రాముడన్న మాటలువిని
లజ్జితుడై తలవంచుక
ప్రస్తాపముతప్పింపగ
పలికెనిట్లు లక్ష్మణుండు

మనజనకుడు దశరథుడే
మనలజూడనిటకు వచ్చు
చున్నాడని తలచెదనని
అన్నతోడపలికెనంత
అనుజుడు లజ్జితుడయ్యెన
టంచు రాముడిట్లనియెను

అవును లక్ష్మణా! అట్లే
అనుపించును నాకుకూడ
మనజనకుడు మనలజూడ
చనుదెంచుచున్నాడని

మనయెడబాటోర్వలేక
మనల నయోధ్యకుదొడ్కొని
పోనెంచెనొ లేక సీత
నైనను దోడ్కొని పోవునొ!

అదిగో! సేనాముఖమున
అరుదెంచుచున్నది మన

జనకుని పట్టపుటేనుగు
శత్రుంజయ మల్లదిగో!

కానీ మననాన్నగారి
ఘనమగు శ్వేతచ్ఛత్రము
లగుపడకున్నది నాకెదొ
అనుమానముగా నున్నది

లక్ష్మణ! తత్క్షణమెనీవు
వృక్షముపై నుండి దిగుము
అనిరాముడు పలుకగ ల
క్ష్మణుడు చెట్టుదిగివచ్చెను

అన్నదమ్ములిరువురు సై
న్యముల వంకచూచినారు
సేనలుగిరి ప్రాంతమ్మును
చేరి విడిసియుంటగనిరి

**భరతరామ సమాగమం**

సేనవిడియ నానతిచ్చి
తానుకాలినడకతోడ
రామునివెదకుచు భరతుడు
రాసాగెను వడివడిగా

అగ్నిహోత్రధూమమదిగో
అగుపడుచున్నది అచటనె
రామన్నయ ఉన్నాడని
ప్రమోదాబ్ధిదేలిపోయి

తడబడుఅడుగులు వేయుచు
వడివడిగా భరతుడు శ్రీ
రామాశ్రమమును జేరగ
రాసాగెను పరుగెత్తుచు

అగుపించెను పర్ణశాల
అచటజటామండలధరు
డయి గూర్చునియుండినట్టి
అన్నునుగని తొట్రుపడుచు

అన్నయ్యా! నానిమిత్త
మడవుల పాలయినావా!
అనుచుకంటనీరుగ్రమ్మ
అన్నపాదములను గనక
అడుగులుతడబడ భరతుడు
పడిపోయెను నేలమీద

ఆపైశత్రుఘ్నుడు రా
మన్న పాదములపైబడె
నంతరాముడా యిరువుర
నాదరమున లేవనెత్తి
కౌగిలించుకొని జలజల
కన్నీళ్లను గార్చినాడు

భరతశత్రుఘ్నుల నిరువుర
ప్రక్కన గూర్చుండబెట్టు
కొని రాముడు కుశలప్రశ్న
లను వేసెను భరతునితో

నాయన తమ్ముడ భరతా
నాన్నగారు కుశలమెగద!
వారినిట్లు ఒంటరిగా
వదలియేల వచ్చినావు

ప్రజలు క్షేమమేకద! నీ
రాజ్యపాలనము చక్కగ
సాగుచునున్నది కాదా!
శత్రుభయములేదుకదా!

అనిరాముడు కుశలప్రశ్న
లను వేసినయంత భరతు

డన్నా! నాకేలరాజ్య
మగ్రజుడవు నీవుండగ

జ్యేష్ఠుడుండగాకనిష్ఠు
డెక్కడైన రాజగుటను
ఆచారముకలదా! రా
మన్నా యికతిరిగి వచ్చి
పట్టంబును గట్టుకొనుము
ప్రజలను పాలించుకొనుము

మనజనకుడు నీవియోగ
మును భరించలేకదుఃఖ
పడుచునిన్నెస్మరియించుచు
విడిచెను తనప్రాణములను

తర్పణాది యపరక్రియలు
తండ్రికి నేనుశత్రుఘ్ను
డిదివరకే గావించితి
మిక నీవునులక్ష్మణుండు
విడువుడు జలతర్పణాలు
బ్రీతితోడమనతండ్రికి

పితృదేవునకు ప్రియాతి
ప్రియపుత్రుడవీవుకాన
ప్రియపుత్రుని తర్పణాలు
పితృదేవుల కగుఫలములు

**రాముడు తండ్రికి జలతర్పణాదులొనర్చుట**

తండ్రిమరణ వార్తవినిన
తత్క్షణమే శ్రీరాముడు
వేళ్లవరకు నరుకబడ్డ
వృక్షమువలె మూర్ఛబడెను

శీతలోపచారంబులు
చేసిరంత భరతాదులు
కొంతవడికి మూర్ఛతేరు
కొని రాముడుదుఃఖించెను

అకటా! ననుతలచుకొనుచు
అసువులు వీడిన తండ్రికి
తత్సమయమునందున జల
తర్పణాలు విడువనైతి

తండ్రికి దహనక్రియలను
దగ్గరుండి సేయనైతి
నని తనదుర్విధికి వగచి
అమితముగా దుఃఖించెను

రాముడు సీతాలక్ష్మణ
సమేతముగ మందాకిని
నదికినేగి స్నానమాడి
వదలెను జలతర్పణాలు

దక్షిణదిశతిరిగి జలము
తమ దోసిలినిండపట్టు
కొని తండ్రికి జలతర్పణ
మొనరించిరి యాముప్పురు

ఆనదీతీరమును విడి
ఆవలికేగి యచటతం
డ్రికి శ్రద్ధగచేసె సపిం
కరణము రఘురాముడు

గారపిండిరేగుపండ్లు
కలిపి పిండములను చేసి
దర్భలపైనునిచి భక్తి
తండ్రికి పిండముపెట్టెను

రాముడంతట నదీతీ
రమునువీడి పర్ణశాల
కేగిభరత లక్ష్మణులను
కౌగిలించుకొని ఏడ్చెను

అంతగొల్లుమని రందరు
హాహాకారాల తోడ
ఆర్తనాదములు చేసిరి
అడవియంతనినదించెను

భరతుని వెంబడివచ్చిన
పౌరముఖ్యులును మొదలగు
జనులాధ్వని వినియచటికి
చనుదెంచిరి దుఃఖించిరి

కులగురువు వసిష్ఠుడుతో
డ్కొనిరాగా రాజపత్ను
లందరటకు వచ్చిరామ
చంద్రునిగని నంతటనే
గొల్లుమనరి రాముడంత
తల్లుల పాదాలకు సా
ష్టాంగ నమస్కారంబులు
సలిపినాడు భక్తితోడ

కౌసల్యాదేవియంత
కన్నీళ్లను కార్చుచురా
మయను లేవనెత్తి చేత
నతనివీపుదుమ్ముదులిపె

సౌమిత్రియు జానకియును
సాష్టాంగప్రణామాలను
ఆతల్లులకందరకును
ఆదరమున చేసినారు

అపుడు వసిష్ఠమహర్షికి
ఆదరమున సాష్టాంగప్ర
ణామంబులు చేసినాడు
రాముడు సద్గుణధాముడు

**భరతుని అభ్యర్థన**

గురుడు వసిష్ఠుడు రాముడు
కూరుచున్న పిదపభరతు
డన్నకు తలవాల్చి మ్రొక్కి
అభిముఖుడై కూర్చుండెను

అతనివెంట వచ్చిన సచి
వాదులెల్ల కూర్చుండిరి
అన్నతోడనతడేమని
యనునోఅని వినదలచిరి

తమ్ముడ భరతుడ నీవిటు
తాపసివలె జడలుదాల్చి
వల్కలాలు దాల్చియిటకు
వచ్చుటకేమిటి హేతువు

రాజ్యమువిడి నీవిట్లు అ
రణ్యమునకు రానేటికి
విషయమంత వివరముగా
వినగోరెద వివరించుము

అనిరాముడు అడిగినంత
తనచేతులుమోడ్చి భరతు
డన్నతోడ పలికెనిట్లు
అశ్రులుకన్నులనిండగ

అన్నయ్యా! స్త్రీయగు మా
యమ్మయైన కైకేయీ
ప్రేరణచే నినుజనకుడు
విపినములకు పంపినాడు

స్త్రీమాటలువిని తాచే
సిన నేరమునకు తనకీ
ర్తిని యంతనశింపజేసి
కొని పాపముగావించెను

నాతల్లినియేమందును
నాన్నను వంచించినాకు
పట్టముగట్టించి తాను
పట్టపురాణిగ వెలగగ
భావించియు నిన్నడవికి
పంపెనెంతదుష్టురాలు

ఆపాపమునకు వైధ
వ్యమునుబొంది దుఃఖీతయై
యున్నది ఇకనరకమేగ
నున్నది పాపిష్టురాలు

ఆమెకడుపులోపుట్టిన
యందుకు నాకపఖ్యాతి
కలిగెను రామా నాపై
కరుణజూపవలయు నీవు

అన్నా సురపతివలె రా
జ్యాభిషేకమొనర్చుకొని
శరద్రాత్రిని సుధాంశుని
చందముధాత్రిని నేలుము

జ్యేష్ఠక్రమమున నీకే
చెందును ఈరాజ్యలక్ష్మి
యోగ్యతచే నీవేతగి
యుంటివి యీరాజ్యమేల

నేను మంత్రివరులు ప్రజలు
నినుశిరసాయాచించుచు

నున్నారము కాదనకుము
అన్నా! మముకటాక్షించు

అనికన్నీళ్లను గార్చుచు
అన్నపాదములపైబడి
యాచించెను భరతుడుసా
ష్టాంగముగ నమస్కరించి

**రాముని సమాధానం**

అంతరాముడా భరతుని
ఆదరమున లేవనెత్తి
కౌగిలించుకొనియునీప్ర
కారముగా బదులాడెను

భరతా! రాజ్యముకొరకై
భ్రాతృవంచనము చేసెడి
వాడవనుచు నేమాత్రము
భావించుటలేదు నిన్ను

పిల్లతనము చేతనీవు
తల్లిని దూషించుచుంటి
వదియుక్తము కాదునీకు
అమ్మ పరమపూజ్యురాలు

అమ్మానాన్నలు బిడ్డల
నాజ్ఞాపించ సమర్థులు
వారియాజ్ఞతలదాలిచి
వనవాసమునకు వచ్చితి

నిన్నువారు రాజగుటకు
నియమించిరి రాజ్యమేలు
మిదినీకర్తవ్యము నీ
కిది అతిక్రమించతగదు

తండ్రిమాటనిలబెట్టుట
తప్పని ధర్మము నాకది

నీవును నీతండ్రిమాట
నిలబెట్టుట నీధర్మము

నీవయోధ్యకేగి రాజ్య
మేలుకొనుచునుండుము నే
వనవాసము పూర్తిచేసి
వచ్చి రాజ్యమేలుకొనెద

జనకుడు నాకిచ్చినట్టి
వనవాసమె నాకుహితము
వలదునాకు సకలలోక
ములపరిపాలించుటైన

రాముడిట్లు చెప్పుచుండ
రవిక్రుంకెను ఆరాతిరి
యంత మహారాజుమృతికి
నార్పులతోనే గడిచెను

ప్రాతంః స్నానాదివిధుల
ప్రాకటముగ నెరవేర్చుక
వారందరు రాముని చు
ట్టూరజేరి కూర్చుండిరి

**భరతుని వాదన**

భరతుడపుడు రామునితో
పలికెనిట్లు వినయమొప్ప
అన్నయ్యా! ఒక్కమాట
విన్నవింతు నాలకించు

మాఅమ్మమనోభీష్టము
మన్ననవెరవేర్చుటకై
నీరాజ్యము నాకిచ్చితి
నేనిపుడా రాజ్యము నీ
కిచ్చెదనిక దానిని నీ
వేలుకొనుము యథేచ్ఛముగ

నీతమ్ముడ నీభృత్యుడ
నీవుండగనేను రాజ్య
మేలుటెంతఅనుచితమో
ఈవెరుగవె ధర్మజ్ఞా!

నీవుసమర్థుడవు గాన
నిన్నందరు ఆశ్రయింతు
రసమర్థుడనేనందర
నాశ్రయించవలసివచ్చు

అందరెవని నాశ్రయింతు
రతనిజన్మమే జన్మము
అందరనెవడాశ్రయించు
నతని జన్మ జన్మయగునె?

తురగమువలెగార్దభంబు
పరుగులెత్తలేనట్లుగ
గరుత్మంతు చందంబుగ
కాకి ఎగురలేనట్లుగ
నీమాదిరి ప్రవర్తించ
సామర్థ్యము నాకులేదు

నీవేఈరాజ్యమేల
రావలయును రామప్రభు!
మాఅందరి అభీష్టమును
మన్నన నెరవేర్చవలయు

మనమంత్రులు మనపౌరులు
మనవారందరు నీవే
తమరాజుగ నుండాలని
తహతహపడుచున్నారలు

అన్నా! ఇకనావిన్నప
మాలకించి రావలయును

నీరాజ్యము నీవేలగ
వేరావలయును వలయును

అచటగూడియున్న ప్రముఖు
లందరు భరతుని మాటకు
బాగుబాగు అనిమిక్కిలి
ప్రశంసించినారప్పుడు

రాముడుభరతుని ప్రార్థన
కేమాత్రము సమ్మతించ
డాయెనంత భగ్నహృదయు
డై భరతుండేడ్వసాగె

**రాముని గీతోపదేశం**

**(వైరాగ్యయోగం)**

తమ్ముడ! నీకొరకై మీ
యమ్మ కోరుకొనుటచేత
నాన్ననన్ను అడవికంపి
నాయెడబాటుకు దుఃఖితు
డై మృతుడయ్యెను అని నీ
వనుకొనుచున్నట్లున్నది

ఇందుకుకారణమునీవు
యేమాత్రముకాదు నీదు
జననియుకారణముకాదు
జనకుడంతకన్నకాదు

తమ్ముడవిను మానవుడెవ
డిమ్మహికాడు స్వతంత్రుడు
ఐచ్ఛిక వ్యాపారమెవని
అధీనములోనుండదు

దైవము ప్రతివాడిమెడకు
త్రాడుగట్టిలాగికొనుచు

ఇటకునటకు గొనిపోవును
ఎవ్వరడ్డుపడగలేరు

ఇంద్రియమ్ములకు నియంత
ఈశ్వరుడే కానఅతడు
ఎట్లునియోగించునో, నరు
డట్లొనరించుచునుండును

ధర్మంబిదియనితెలిసియు
ధర్మమాచరించకుండు
అధర్మమిదియని యెరిగియు
అదిసేయుటమానకుండు

మనుజుడే స్వతంత్రుడేని
తనబాగునెగోరు కొనుచు
తనకుకీడుకలుగకుండ
నొనరజేసికొనవచ్చును

జగతినట్లుగాన రాదు
జరామరణవిలయ వియో
గములనెవడు గోరకున్న
గలుగుచుండు దైవికముగ

పుట్టినయే ప్రాణియైన
గిట్టుచుండు గిట్టినయే
ప్రాణియైన తిరిగిరాదు
పరమసత్యమిది భరతా!

పక్వఫలమ్మునకు క్రింద
పడిపోవుటయే తప్పదు
కాననీవు జనకుని మర
ణానికి దుఃఖించవలదు

మరణమెవడు కోరుకొనడు
మరణించుటతప్పకుండు

ఇందుకు కారణముదైవ
మేయైయున్నది భరతా!

ఆయువుశాశ్వతముగాదు
పోయినప్రతిక్షణమదెపుడు
మరలిరాదు కానిదాని
మలచుకొనుము సార్ధకముగ

పురుషునితోపుట్టునుమృతి
పురుషునితో గూడియుండు
పురుషునితో దిరుగాడును
పురుషునితోనే పోవును

కడలినీటిపైన రెండు
కట్టెలొకటి నొకటి జేరి
కూడికొంత సమయానికి
వీడిపోవుచున్నట్లుగ

ఆలుబిడ్డలును ధనాదు
లందరొకళ్లొకళ్లతో
సంబంధముగలిగికొంత
సమయానికి విడిపోదురు

ఇట్లగుటకు కాలబలమె
హేతువువేరొకటికాదు
ఇలలోయేప్రాణియు తన
ఇచ్ఛగవర్తించలేదు

జీవితకాలములోనే
చీలిపోవుబంధుమిత్రు
లాయువువిడిపోవునపుడు
ఆపలేరు వారెవ్వరు

వారందరు ఋణమును రా
బట్టుకొనగవచ్చినారు
ఋణముతీరగానే వా
రెటుబోదురొ కనిపించరు

వారందరు బంధువులా
వారందరు స్నేహితులా
తనదేహమె విడికనుంచు
కొనుటకు వీల్కానప్పుడు
పరులదేహములగురించి
పలుకనేల వింతకదా!

ప్రవాహమ్మువలెవయస్సు
పరుగెత్తును తిరుగులేక
గానధర్మమాచరించి
గాంచవలయు పరసౌఖ్యము

పెద్దలుపోయిన త్రోవను
బుద్ధిగబోవలయు వారు
గమ్యస్థానముదెలిసిన
ఘనులు మార్గదార్శనికులు

మనజనకుడు ధర్మరతుడు
ఘనకార్యములెన్నొ జేసె
పుణ్యకార్యములనొనర్చి
పొందెను స్వర్గసుఖంబుల

అతని మాటగౌరవించు
టదియె కీర్తికరముమనకు
అతని ఆన పదునాలుగు
అబ్దములడవివసింతును

నీవును పురమేగి ధర్మ
నియతితోడ రాజ్యమేల
వలయునీకు పితృసముడను
వలదనకుము నామాటను

రాముడయోధ్యకు వచ్చిన
రాజ్యమేలు నతనిధర్మ
పరిపాలనవలన ప్రజలు
బహుసౌఖ్యముగానుందురు
అనిభావించిన భరతుడు
అన్నతోడ నిట్లనియెను

అగ్రజ! నాతల్లిచేసి
నట్టి దుష్కృతమ్ముచేత
మనతండ్రికి పాపమంటు
కొనకుండగ జేయవలయు

అనఘా! నేదేశాంతర
ముననుండగ నాదుజనని
నానిమిత్తమై అధర్మ
మైన అకార్యముచేసెను

మనజనకుడు మోహముచే
తనధర్మాతిక్రమణము
చేసినాడు దానిని సరి
చేయవలయునీవు ప్రభూ!

భరతడుసాష్టాంగముగను
ప్రణమిలి అన్నయ్యా! నా
మనవిచిత్తగించుమనుచు
మరిమరియెంతగవేడిన
రాముడుభరతుని విన్నప
మేమాత్రము మన్నించక
బదులుగనిట్లని పలికెను
అదిరహస్యమైన మాట

మునుమనజనకుడు నీత
ల్లిని పరిణయమాడునపుడు
ఆమెకు పుట్టిన వానికె
అభిషేకము జేతుననుచు
వాగ్ధానముచేసె నన్న
వార్తనేనువిన్నాడను

(ఈరహస్యమును సుమంత్రు
డెరిగిన వాడగుటచేత
అడవికి ననుదింపవచ్చి
నపుడాతడు నాకుచెప్పె

ముందెరిగిన అభిషేకం
బునకు నొప్పుకొని యుండను
తండ్రి మాటనిలబెట్టుట
ధర్మము నాదైయుండును)

అట్లగుటను రాజ్యమునీ
దగునుకాని నాదికాదు
రాజ్యమునీకిచ్చి మహా
రాజుతప్పుసేయలేదు

నీకురాజ్యపాలనమును
నాకరణ్యవాసమ్మును
కోరిన నీతల్లి కోర్కె
దీర్చుటకై మనజనకుడు
శపథము జేసెను దానిని
చక్కగనెరవేర్చవలయు

నీవురాజ్యమేలవలయు
నేనుకాననుండవలయు
అట్లుచేయుటే జనకుని
ఆజ్ఞను పాలించినట్లు

జనకుని మాటనునిలబె
ట్టినతనయుడె తనయుడగును
జనకునకఘమంటకుండ

జనకాజ్ఞను పాలింతము

జనకుని పున్నామ నరక
మున గూలక రక్షించును
కనుక కొడుకునకు పుత్రుం
డను నామము సిద్ధించెను

తండ్రిమాటనిలుపుటకై
తరలివచ్చితిని కానకు
నీవును నీతండ్రిమాట
నిలుపరాజ్యమేలుకొనుము

కానియెడల భరతా! నీ
కారణమున మనజనకుడు
అనృతదోషమున నరకం
బరుగవలసియుండునయా!

అతనిమాటనిలుపుటకై
అడవికినేవచ్చినాను
నీవయోధ్యకేగిరాజ్య
మేలుటవశ్యము భరతా!

నీవెంతగవాదించిన
నిష్ప్రయోజనము భరతా!
నేనయోధ్య రానురాను
నీవిక ఆశించవలదు

అనిరాముడునిష్కర్షగ
అన్నమాటలకు భరతుడు
భగ్నహృదయుడై రాముని
పదములపైబడి ఏడ్చెను

**జాబాలి నాస్తికవాదం**

రామరాజ్యమందుప్రజా
క్షేమమువర్ధిల్లుననుచు

రామభద్రునైటైనను
రాజ్యమేలజేయవలయు

అనిసమస్త ప్రజలు ప్రముఖు
లునుకాంక్షించుచునుండిరి
రాముని నిశ్చయము మర
ల్చగ జాలక నూర్కుండిరి

ప్రజాహితముగోరిన జా
బాలిమంత్రి గళమెత్తెను
తానుస్వయమ్ముగఆస్తికు
డైనాస్తిక ధ్వజమెత్తెను

కఠిన పత్యముండలేని
కన్నబిడ్డకమితప్రేమ
వలన తల్లి అపథ్యమగు
వస్తువునిడుచందంబున

రామునిపై వాత్యల్యము
ప్రబలుటచే జాబాలి అ
ధర్మోక్తులపలికినాడు
తమకమెంతచెడ్డది కద!

రామప్రభు! ఇదినీమూ
ర్ఖత్వముగాకున్న రాజ్య
భోగంబులవిడిచి మౌని
వోలెకాననుండదగున?

ఎక్కడితలిదండ్రులు! తమ
సౌఖ్యముకొరకై కలియగ
శుక్లశోణితములు గూడి
సుతుడుగ నరుడుద్భవించు

బీజమాత్రుడగుతండ్రికి
పిండాదులు పెట్టుటెల్ల

ఆరిపోయినట్టి దివ్వె
కూరక తైలముపోసిన

కైవడివ్యర్థము గావున
నీవయోధ్యకేగి రాజ్య
భోగంబుల ననుభవించు
మునిజీవనమేల నీకు?

ఎవరుతల్లి ఎవడుతండ్రి?
ఎవరికెవడు బంధువగును
పుట్టునపుడు జోడెవ్వడు?
పోవునపుడుతోడెవ్వడు?

మృతుడెవ్వడు తిరిగిరాడు
మృతుడేమగునో తెలియదు
చచ్చిన నీతండ్రి కొరకు
శ్రాద్ధాదులు వృధాయగును

ఈదినమష్టకశ్రాద్ధ
మ్మీదిన మాబ్దికమనియును
వైదికకర్మలు చేయుట
వెర్రితనమదెట్లండువ!

మృతునిపేరు చెప్పికదా
ఇతరులు దినుచున్నారలు
బ్రతికిన వాడన్నముదిన
మృతునికడుపునిండగలద?

ప్రయాణమైపోవునట్టి
వానికి శ్రాద్ధము పెట్టిన
వానికడుపునిండునెట్లు
వంచనసూక్తులివన్నియు

తినమరిగిన బ్రాహ్మణులీ
తీరు శ్రాద్ధకర్మల నే

ర్పరచినారు తేరక నలు
పురుతిని పోవుటకెకాని

చచ్చినవాడన్నముదిను
టెచ్చటనైనను కలదా?
శ్రాద్ధముపేరిట తినుటకు
సిద్ధముగానుందురుకద!

పరలోకములేదు మృతుడు
పరసౌఖ్యముపొందునెట్లు
మరణించిన తండ్రికొరకు
పరముగూర్చిచింతించకు

ప్రత్యక్షఫలములనువిడి
పరోక్షసుఖముల కొర్కై
పరితపించు వారెల్లరు
పరమమూర్ఖులనితలతును

పరలోకము మిథ్య,నీవు
భరతుని ప్రార్థనమును విని
రాజ్యపాలనముసేయుము
రామా! నామాట వినుము

బ్రతికినంతవరకెకాని
మృతుడైపోయిన పిమ్మట
సంబంధము తెగిపోవును
చచ్చిన నీతండ్రి యాజ్ఞ
పాలించెదననుటదెల్ల
పరమమౌఢ్యమని పించును

**రామునిఖండన**

జాబాలివచించినట్టి
చార్వాకమతోపదేశ
మునువిని రాముడు మిక్కిలి
కినుకజెంది పలికెనిట్లు

ఓ బ్రాహ్మణ! నీమాటలు
యుక్తములట్లనిపించును
గాని అయుక్తములు ధర్మ
హానికరములై యున్నవి

నరునియోగ్యతాయోగ్యత
నెరిగించును వానినడక
ధర్మవేషమూనినేన
ధర్మము సేయగజాలను

నేనాడిన మాటతప్ప
లేనుఅట్లు నేచేసిన
యధారాజ తధాప్రజా
యనెడితప్పదారి ప్రబలు

సత్యము మీదనె లోకము
శాశ్వతముగ నిలుచున్నది
సత్యరూపమే ధర్మము
సత్యరూపమే బ్రహ్మము

అనృతమాడువానిజూచి
అవనిలోని ప్రజలందరు
క్రూరసర్పమును జూచిన
తీరున భయపడుచుందురు

వనవాసముగావించెద
ననిజనకునితో ప్రతిజ్ఞ
చేసియెట్లుదానినిపుడు
చేయక సత్యముతప్పుదు

సత్యరూపమగు ధర్మము
నిత్యమైన ఆత్మరూప
మగు నననినే భావింతును
ఆత్మవంచనము సేయను.

సత్యంబును ధర్మంబును
శమముదమము భూతదయయు
ప్రియవాక్యము నీతినియమ
విక్రమాలు స్వర్గమునకు
సోపానములను విబుధుల
సూక్తుల విన్నాడనేను

శతక్రతువులుచేసిఇంద్రు
డతులిత స్వర్గాధిపత్య
మునువహించి తేజరిల్లె
నని ఆర్యులనంగవింటి

కావుననేవిహిత ధర్మ
కర్మలన్నిసలుపుచు స్వ
ర్గాదిదివ్యలోకంబుల
నందగోరుచున్నాడను

వైదికవేషము దాల్చిన
బ్రాహ్మడనై నాస్తికమత
మును బోధించుచునుండిన
నినుదగ్గర దీసిన మా
జనకుండును నిందనీయు
డనక తప్పదయ్యెనకట!

**జాబాలి వివరణ**

అంతటజాబాలి సవిన
యమ్ముగ బలికెను రామా!
నాస్తికుడను కానునేను
ఆస్తికుడను ముమ్మాటికి

ధర్మసంకటము వచ్చిన
తరుణమందు నెట్టెనను
సత్కార్యము సాధించెడి
సంకల్పముతో నాస్తిక

మతవాదము నేచేసితి
మహితాత్మా! మన్నింపుము

రాజ్యమును విపత్తునుండి
రక్షించగదలచి నిన్న
యోధ్యకు మరలించనెంచి
ఓరామా! నేనీవిధి
నాస్తిక వాదముచేసితి
నాస్తికుడను కానునేను
అని జాబిలిమహాశయు
డను నయమొప్పగ బలికెను

## వసిష్టని సమర్ధన

అంతవసిష్ఠుడురాముని
ఆగ్రహమును జాబాలిహృ
దంతరమును తెలిసిన వా
డై ఇట్లని చెప్పదొడగె

రామా! నిన్నెట్టైనను
రాజుచేయనెంచి అయో
ధ్యకునిను మరలించనెంచి
అతడీవిధి వాదించెను

ఇతడు నాస్తికుండుకాదు
ఇతనియెడల సందేహము
వలదీతడు నీహితమ్ము
వాంఛించిన మహిత్మాత్ముడు

ఇంకనువిను రామా మీ
ఇక్ష్వాకుల వంశమందు
పూర్వమునుండియు జేష్ఠుడె
భూమినేలుచును వచ్చెను

అగ్రజుడుండగ అనుజుం
డవనీశుండగుట లేదు

కావున పెద్దలక్రమమున
నీవుభూమినేలవలయు

అనివసిష్ఠుడెంతగ చె
ప్పినను రామచంద్రుడు పితృ
వాక్యమునే దాటననుచు
వాక్రుచ్చెను నిశ్చితముగ

## భరతుని ప్రాయోపవేశం

భరతుడు రాముని నిశ్చయ
మెరిగి పరమదుఃఖితుడై
దర్భశయనుడై కుటిముం
దరపరుండె రోదించుచు

పర్ణశాలకడ్డముగా
భరతుడట్లు పరుండగా
రాముడతని లేవనెత్తి
ప్రేమతోడ నిట్లనియెను

భరతా! ఇదితగదునీకు
త్వరగలేచినను స్పృశించి
ఆచమించు క్షత్రియుడవు
ఆచరించకూడదిట్లు

నేనుమాటతప్పవాడ
కాను తండ్రితో చేసిన
ప్రతిన నాచరించికాని
పట్నమునకు తిరిగిరాను

భరతుడట్లు పరుండియే
పౌరజానపదుల జూచి
మీరలయిన రామునకే
మియు చెప్పర! అనిపలికెను

అంతటజనులందరు బదు
లాడిరిట్లు రాముడుపితృ

వాక్య పాలనాధర్మము
వదలడు ఇది నిశ్చయమ్ము

అతని మరల్చుట మాచే
నలవికాదు ఇదిసత్యము
అతడు చెప్పనది సత్యము
అనుచితమేలేదిందున

పౌరజానపదులమాట
భరతా! ఇకవింటివికద!
శీఘ్రముగా లేచినీవు
స్పృశియించుముననుజలమున
అని రాముడు పలికినాడు
అనునయముగ భరతునితో

నిరాశుడై భరతుడు క
న్నీళ్లుగార రోదించెను
అంతవసిష్ఠుని సలహా
అమోఘమై ఫలియించెను

స్వర్ణపాదుకలుగొనితే
బడెను రాముడందునతన
పాదములను నిలిపివిడెను
భరతుడు వాటినిచేగొని

మృత్యుంజయమనుగజంబు
మీద నునిచి ఛత్రచామ
రాది రాజలాంచనముల
నాదరమున పూజించెను

**పాదుకా పట్టాభిషేకం**

రామపదస్పర్శచేత
రాయినాతిగా మారెను
పాదుకలకు రాజ్యమేలు
భాగ్యము సంప్రాప్తిల్లెను

కర్కశఘోర విరాధుడు
గంధర్వుడుగా మారెను
దనుజేశ్వరుడగు రావణు
తమ్ముడు రాజైపోయెను

రామపాదుకుల తనమూ
ర్థమున దాల్చి భరతుండి
ట్లని పలికెను రామా! నీ
యట్లగ ముని వేషముతో
తావకపాదుకయుగమును
తగ సింహాసనము నందు
నునిచి రాజ్యభారమంత
నొనరఅప్పగించి, పదియు
నాల్గేడులు పాలించెద
ఆగడువది దాటగనే
నీవురాకయున్న యెడల
నిహతునౌదు నగ్నిదూకి

అనిపలికిన భరతునితో
అంగీకారము దెలుపుచు
అట్లాగే అని అత్యం
దారమున రాముడు భర
తుని అక్కునజేరిచి కొని
మనసారగ దీవించెను

భరతుడంత శ్రీరాముని
పాదుకలకు ప్రదిక్షణము
చేసివాటి నాదరమున
శిరమున ధరియించి రథము

పైనెక్కి శత్రుఘ్నుతోడ
ప్రయాణమయ్యెనయోధ్యకు

కదలిపోగ కాళ్లాడక,
కనులనీరు గ్రమ్మగ పెద
వులు వణకగ మాట్లాడక
నిలుచుండిన తల్లులగని
శిరమువాల్చి నమస్కృతులు
చేసెను శ్రీరామమూర్తి

అపుడు దుఃఖముబికిరాగ
నపుడాతని కేడ్పువచ్చి
ఆపుకొనగలేక పర్ణ
శాలలోనికేగెను బా
ష్పాలుకనులనిండుకొనగ

వసిష్ఠాది ప్రముఖవరుల
వాహనాలు ముందునడువ
పావకోళ్లుతలదాల్చిన
భరతుని రథమరిగెవెనుక

దారిమధ్యలోన భర
ద్వాజాశ్రమమును సంద
ర్శించి మహర్షికి జరిగిన
వృత్తాంతము వివరించెను

యమునా గంగలదాటుచు
నాభరతుడు శృంగిబేర
పురమునుదాటి యయోధ్యా
పురిని జేరుకొనె నప్పుడు

రాజధాని ఆఅయోధ్య
రామదుఃఖపీడితయై

ధనువునుండి తెగినఅల్లె
త్రాటివోలె కనిపించెను

జలమంతయు శుష్కించగ
జలచరములు నాశమొంద
గ్రీష్మర్తువునందెండకు
కృశియించిన నది విధంబు
కలువలు లేనట్టికొలను
కరణి, కళారహితమ్మయి,
రాజధాని శశివిహీన
రాత్రివోలె కనిపించెను

పాడువడిన యాగశాల
వలె క్రయవిక్రయరహితం
బగుటచేత మూసివేసి
నట్టి అంగళుల కైవడి
కాంతిహీనమై అయోధ్య
కనుపడుచున్నది సారథి!
కన్నతండ్రి స్వర్గమేగె
అన్నగారు అడవికేగె
రాజధాని భర్తవిడిన
రామవోలె కనిపించెను

రామదుఃఖపీడితయగు
రాజాంతఃపురమునుగని
వసిష్ఠాది ముఖ్యులతో
భరతుడిట్లు వాక్రుచ్చెను

ఈదుఃఖము సైపలేను
ఈఅయోధ్యనుండలేను
ఇపుడే నేనందిగ్రామ
మేగి ఉందుఅచటనుండి

యే రాజ్యాంగముచూచెద
ఈ అయోధ్యనుండలేను

అన్నగారు వచ్చువరకు
అటనుండియె రాజ్యాంగపు
వ్యవహారములను చూచెద
నందుకొప్పుకొనవలయును

ఆమాటలు విన్నవసి
ష్ఠాది ముఖ్యులెల్ల భరతు
భ్రాతృవత్సలతకు మెచ్చి
బాగుబాగు అనిపలికిరి

తల్లులకందరకును వం
దనమొనర్చి సంతసమున
పాదుకలను తలనుదాల్చి
భరతుడపుడు శత్రుఘ్నుని
గూడినంది గ్రామమునకు
వేడుక రథమెక్కి వెడలె

అతనివెంటమంత్రిపురో
హిత వసిష్ఠగురు ప్రముఖు
లందరు ప్రాఙ్ముఖులై ఆ
నందిగ్రామమునకేగిరి

రమ్మని చెప్పకపోయిన
రథగజాశ్వసంకుల సై
న్యంబంతయు నతనివెంట
నందిగ్రామమును జేరెను

భ్రాతృవత్సలుడు భరతుడు
రామపాదుకలకు వైభ
వోపేతముగా పట్టం
బొనరగట్టి భువినేలెను

వనవాసము పూర్తిచేసి
వచ్చుదాక రామప్రతి
నిధులుగనుండిన వాటికి
నిత్యపూజలర్పించును

సామంతుల కానుకలను
సమర్పించు పాదుకలకు
రాచకార్యముల వాటికి
దాచకుండ నివేదించు

బహుమతులను సమస్యలను
పాదుకలకు నివేదించి
ఆపైకార్యములన్నియు
అతిశ్రద్ధగ నిర్వహించు

అన్నతిరిగి రాగానే
మన్నన ఈపాదుకులను
అతని పాదములకు తొడిగి
అప్పగింతు ఈరాజ్యము
అనిదృఢవ్రతుడై భరతుడు
మునిచందము జటలుదాల్చి
నారబట్టలను ధరించి
నందిగ్రామముననుండియె
భూమినెల్లపాలించెను
రామపాదుకల మహిమను

రాతినిగుర జేసిన శ్రీ
రామపాదముల స్పర్శకు
సంప్రాప్తిలె పాదుకలకు
సామ్రాజ్య మహాభాగ్యము

**సౌభ్రాత్రము నాడు - నేడు**

సవతులకొడుకులకెంతటి
సౌభ్రాత్రత పరస్పరము

గంగాజమునలకైవడి
సంగమించినారు నాడు

ఏకోదరులైన నేమి
ఇంత సందుదొరికెనేని
కడపుమీద వెన్నుమీద
పొడువ సిగ్గుపడరు నేడు

అపకృతి చేసిన భ్రాతల
నట్లొనర్చినారప్పుడు
ఉపకారము పొందికూడ
అపకారము చేతురిపుడు

కొట్టినవానిని కొట్టుట
చట్టమనుతించెనాడు
పెట్టిన వానినికొట్టుట
పెనుబామనిపించునేడు

ఆనాటికి ఈనాటికి
అదిఏరా వ్యత్యాసము
నాడున్నది యెదురువేటు
నేడున్నది వెన్నుపోటు

సౌదర్యంబీయుగాన
ఏదీఅది ఎటుబోయెను?
స్వార్థానికి బలియై అం
తర్థానమ్మై పోయెనా!

**రాముడు చిత్రకూటము వీడుట**

చిత్రకూటగిరియందువ
సించుచున్నమునిజనమా
ప్రాంతమువిడిపోవాలని
భయవిహ్వాలులైయుండిరి

అదికనిపెట్టిన రాముడు
ఆమునికులపతితో నసె
భగవాన్! ఈఋషులందరు
భయభ్రాంతులైయుండిరి
అపచారము మాచేయే
దైన జరిగెనాచెప్పుడు

అనివినయముతో రాముం
డాకులపతినడిగినాడు
అంతట ఆయన ఇట్లని
వింతగొలుప పలికినాడు

రామా మీవలన మాకు
ఏమాత్రంబపరాధము
కలుగలేదు కానీ మీ
కారణమున రాక్షసభయ
మున్నది గావున మునులిం
కొకచోటికి పోదలచిరి

రావణుతమ్ముడు ఖరుడను
రాక్షసాధముడు నీవిట
నుండుటచే మాపైబడ
నున్నాడని విన్నారము

నీవుమునుల పక్షపాతి
వీవు ధనుర్ధారివి ఇక
వాడుమునిద్వేషి రణపి
పాసి కాననీవిట నుం
డుట కోర్వక మముహింసిం
చుటకై యిట రానున్నా
డని వినిభయపడి మునులీ
ప్రాంతము విడిపోదలచిరి

రాముడెంత అభయమిచ్చి
రక్షించెదనన్నను వా
రందరు అచ్చోటు వీడి
అరిగిరి వేరొకచోటకి
రామా మీరును మాతో
రండని పిలిచిరి కానీ
వెంటనె అతడచటినుండి
వెళ్లక కొన్నాళ్లుండెను

మునులువెళ్లిపోయినారు
అనుగుతమ్ముడగుభరతుడు
తల్లులతో వసిష్ఠాది
ధరాసురులతో ఇచటికి
వచ్చివెళ్లిపోవుటచే
వారి జ్ఞాపకాలు మదికి
పదేపదే వచ్చుచుండ
భరియింపగరాకుండెను

**అత్రిమున్యాశ్రమము**
అచ్చోటనువీడిరాము
డత్రి మహామున్యాశ్రమ
మునకేగెను ఆమహర్షి
కొనరించెను నమస్కృతులు

ఆమహర్షి దంపతులా
రాముని సీతను లక్ష్మణు
నత్యంతాప్యాయతతో
ఆదరించి అరసికొనిరి

అనసూయాదేవి అత్రి
మునీశ్వరుని ధర్మపత్ని
మహాతపశ్శాలిని, ధ
ర్మానుష్ఠానపరాయణి

ఆమె త్రిమూర్తిస్వరూపు
డగుదత్తాత్రేయ జనని
అఖిలభూతపూజనీయ
అమెదయామృతవాహిని

మునుపొకపుడు పదివర్షం
బులువానలు కురువక భువి
క్షామాగ్నిదహించునప్పు
డామహాతపస్విని తన

ప్రభావమున గంగమ్మను
ప్రవహింపగజేసి, సస్య
ఫలమూలాదుల సృజింప
గలిగినట్టిమహిమాన్విత

మహాపతివ్రతాశిరో
మణి అత్రిమహర్షిపత్ని
సీతాదేవిని మిక్కిలి
ప్రీతితోడ చూచుకొనెను

సీతాసతి ఋషిపత్నిని
సేవించెను భక్తితోడ
అందుకు ఋషిపత్నిమోద
మందిసీతతో పలికెను

ఓసీతా! నీవెంతటి
ఉత్తమాంగనవు భర్తను
అనుసరించి అడవులకే
అరుదెంచిన పతివ్రతవు

సుఖములందు పతిని విడని
సుదతులెందరైన గలరు
కడగండ్లను భర్తవెంట
వెడలివచ్చు వారెవ్వరు?

సంపదలను సౌఖ్యములను
సఖిబంధుజనమ్ములను
విడిచి వచ్చి భర్తవెంట
అడవికి వచ్చిన సాధ్వివి

పతినిమించు బంధువెవరు
పతియే అతివకుదైవము
పతిని విడకసేవించెడి
అతివ భాగ్యమే భాగ్యము

సిరులురాని ఇరులురాని
స్థితి దప్పిదరిద్రుడైన
పతిని విడక సేవించిన
సతికిహపరములు కలుగును

ఇది ప్రతిఅతివకు ధర్మము
ఈధర్మపథమ్మువిడక
యశముబడిసి వర్ధిలుమని
అనసూయాదేవి పలికె

ఆ మాటలువిని జానకి
అత్రిపత్నితో నిట్లనె
అమ్మా! మీమాటలునా
కానందము గూర్చెను పతి
సేవనుమించిన తపస్సు
స్త్రీకి వేరులేదందురు

నా తల్లియు నాఅత్తయు
నాకు పాతివ్రత్యధర్మ
మును బోధించిరి మీరిపు.
డొనరగబలపరిచినారు

సావిత్రీదేవి పతిని
సేవించినదై స్వర్గము
నందుప్రకాశించుచున్న
దిందులేదు సందేహము

సతికి పతియెదైవంబను
సంగతినేనెరుంగుదును
సతికి పతియెతల్లిదండ్రి
సర్వంబని యెరుంగుదును

నాపతి ఒకవేళయెంత
పాపిష్ఠుండైన అతని
విడుపక సేవించుట నా
విధియని నేభావింతును

అని సీతాదేవి పలుక
అనసూయాదేవి మిగుల
మోదమంది సీతశిరము
మూర్కొని యిట్లనిపలికెను

జనకసుతా! నీమాటలు
సంతసమును గూర్చెనాకు
నీకోర్కె అదేమొచెప్పు
నెరవేర్తును దానినిపుడె

అంతమొగంబునచిరునగ
పంకురింప సీతాసతి
తల్లీ!నీదయచేతను
తక్కువ నాకేమిలేదు
మమతపూర్ణమగునీఈ
మాటచాలునని పలికెను

అవనిజ మాటకు అనసూ
యాదేవి మరింతహర్ష
మందినదై సీతా! నా
హర్షమునీయందుసఫల

మగుటకు నేనిచ్చునట్టి
ఆభరణాదులు గొనవలె

అని ఆమునిపత్ని సీత
కత్యంతా స్యాయతతో
వాడిపోని సుమాలికను
వాసిచెడని వస్త్రంబును
అపూర్వమగు అంగరాగ
అభరణాదులనిచ్చెను

అమ్మాయీ! నేనొసంగి
నట్టి దివ్యమాలికాదు
లవి నీదేహమునకు ది
వ్యత్యము కలిగించుచుండు

విష్ణువునకులక్ష్మీసతి
వేడ్కగ సంతోషంబును
జేయునట్లు నీభర్తకు
జేతువు సంతోషంబును

అనుచు ప్రీతి పూర్వకముగ
అనసూయాదేవి ఇచ్చి
నట్టి అంగరాగాదుల
నవనీసుత ప్రతిగ్రహించె

అనసూయాదేవిని సీ
తమ్మమిగులభక్తితోడ
చేమోడ్పులు గీలించుచు
సేవింపుచునుండనంత
సీతాదేవి సపర్యల
కాతపస్వినీమణి మో
దాబ్ధిదేలి ఆమెతోడ
అనురాగముతోబలికెను

**సీతతన పెండ్లి కథ చెప్పట**

అమ్మా!జానకి! నీవుస్వ
యంవరమున శ్రీరాముని
చేపట్టితివట అకథ
చెప్పవెనేవినగోరెద

అప్పుడు లజ్జాభూషిత
యై జానకి ఈవిధముగ
తనదు స్వయంవరకథ ఆ
తపస్వినికి చెప్పదొడగె

అమ్మా నాజనకుడు మిథి
లాధీశుడు యజ్ఞభూమి
దున్నుచుండగా శిశువుగ
దొరికితినాయనకు నేను

ఆయన నను గుండియులకు
హత్తుకొనియు అంతఃపుర
మేగినన్ను పట్టమహిషి
కిచ్చెనామెనన్ను పెంచె

పెండ్లీడది వచ్చెనాకు
బెంగ జనించెను నాన్నకు
నాకుతగిన వరునిగూర్చి
నాన్నకు దిగులెక్కువాయె

ఆడబిడ్డకన్న తండ్రి
అమరేంద్రుని సముడైనను
కూతురెదిగి వచ్చెనేని
గుండెమీదబరువుగదా!

తనపరివారలలోనను
తక్కువ వారలలోనను

ఆడబిడ్డకన్నతండ్రి
అలుసైపోవును కాదా!

అయోనిజను అయిననాకు
అర్హుడైన తగినవరుడు
దుర్లభమగుటను నాన్నకు
తోచె నొక్క ఉపాయమ్ము

వీరత్వము శుల్కముగా
పెట్టి స్వయంవరమును ప్రక
టించినాడు శివధనస్సు
వంచి ఎక్కుపెట్టగలుగు
వీరునకే నన్నొసంగి
వివాహమును జరిపెదననె

యజ్ఞమందు సంతసించి
అమరులు మాపూర్వీకునకు
హరు విల్లు నొసంగిరంట
అదిమాయింటనెయుండెను

అదిమిక్కిలి శక్తివంత
మైనది దానిని కదల్చ
నైనను మానవమాత్రుల
కణుమాత్రము కాకుండెను

ఎందరెందరో రాజులు
నేతెంచిరి కానిఒక్క
రైనను దాని గదల్చగ
నైనజాలలేకుండిరి

విశ్వామిత్రుని వెంటను
విచ్చేసిరి రామలక్ష్మ
ణులు వారికిశివధనుస్సు
తిలకింపగ జూపించిరి

శ్రీరాముడునిముసములో
శివధనుస్సువంచి అల్లె
త్రాటినెక్కుపెట్టు నంత
ధనువు పెళ్లుమనివిరిగెను

ఆశబ్దముపిడుగులుపడు
నపుడుకలుగు శబ్దమువలె
భయంకరముగా వినబడి
పరమాశ్చర్యము గొల్పెను

అంతటమానాన్నగారు
సంతసమున నమరాముస
కిచ్చిపెండ్లిసేయనిశ్చ
యించెనంత శ్రీరాముడు

తనతండ్రియభిప్రాయము
తగనెరింగి కాని తాను
ప్రతిగ్రహింపననిపలికెను
పితృభక్తిపరాయణుండు

అప్పుడు మానాన్న గారు
చప్పున మామామయ్యను
రప్పించె మహాత్ముడైన
రామునకునొసంగెనన్ను

నాచెల్లియలూర్మిళమాం
డవిశ్రుతకీర్తులను ల
క్ష్మణభరతశత్రుఘ్నులకిడి
కల్యాణము గావించెను

అంతటవిశ్వామిత్రమ
హర్షులు తమ ఆశ్రమాని
కేగినారు శుభకార్యము
బాగుగముగిసినదనుచును

పిదపమేము మామగారి
వెంట అయోధ్యకు వెళ్లితి
మనిచెప్పుచు సిగ్గు పడుచు
అవనీసుత తలవంచెను

మహిసుత తనపెళ్లికథను
మధురముగాచెప్పగ విని
అనసూయాదేవి మిగుల
ఆనందముతో పొంగెను

బోసినవ్వులెగబోయుచు
మూర్ధముమూర్కొని సీతను
తనబాహుల కౌగిలించు
కొనెనావృద్ధతపస్విని

ముసినవ్వులు విరజిమ్ముచు
ముదుసలిముత్తైదువయగు
అనసూయామహాదేవి
అన్నదిట్లు సీతతోడ

అమ్మాయీ! సంధ్యాసమ
యమ్మైనట్లున్నది ప
క్షులుకలకలయనచునుతమ
గూళ్లకుజేరుచునున్నవి

స్నానముగావించి ఋషులు
జలకలశమ్ములతో తడి
సినబట్టలతో నెలవుల
జేరవచ్చుచున్నారలు

హోమాగ్నులు వ్రేలుటచే
ధూమావళిపావురాల
మెడలవోలెగన్పడుచును
మింటికెగసిపోతున్నవి

తపోవనమునందలి మృగ
తతిపరుండి యున్నదపుడె
సూర్యుడస్తమించెనదిగొ
చుక్కలతోరాత్రి వచ్చె

నే ననుజ్ఞనిచ్చు చుంటి
నీవిక నీవిడిదికేగి
నీపెనిమిటితో నుండుము
నిశివచ్చెను నీరజాక్షి!

సీతా! నే నీకిచ్చిన
చీరలు సొమ్ములు వాసన
ద్రవ్యాదులు నాయెదుటనె
దాల్చగ నిను గన్నారగ
చూచిసంతసింపదలతు
సుస్మిత నాకోర్కెదీర్చు

అనిపలికిన అత్రిపత్ని
అభిలాషను గౌరవించి
అట్లుచేసి సీతాసతి
ఆమెకు వందనమొనర్చె

అనసూయాదేవి మంగ
ళాశీర్వాదముచేసెను
సీతాసతి ఆపిమ్మట
శ్రీరాముని జేరుకొనెను

దివ్యభూషణాన్వితయౌ
దేవిసీతగని రాము డి
దేమని ప్రశ్నించ సీత
వృత్తాంతము వివరించెను

అనసూయాదేవి చేత
మనుష్యులకు పొందనలవి

కానియట్టి సత్కారము
జానకి పొందుటచేతను
రామలక్ష్మణులు మిక్కిలి
ప్రమోదాబ్ధిదేలినారు

ఆరాతిరియంతయు వా
రచ్చటనే గడిపినారు
ప్రాతఃస్నానాదులు ని
ర్వర్తించిన పిదప ఋషుల
కడకుబోయి వీడుకోలు
నడిగిరి ఆరఘువీరులు

ధర్మానుష్ఠానపరులు
తపోధనులు ఋషులురామ
లక్ష్మణులకు మార్గమందు
రాక్షసబాధలు గలవని
చెప్పిరాక్షసుల వధించు
టొప్పగుననిబోధించిరి

రాముడుసీతాలక్ష్మణ
సమేతుడై ఋషులమంగ
ళాచరణములంది దండ
కాటవిని ప్రవేశించెను

## ఫలశ్రుతి

ఇదియెఅయోధ్యాకాండము
ఇదిచదివినవినిన నరుడు
మబ్బువిడిన చంద్రునివలె
మంగళకాంతులు పొందును

శ్రీరామునికృపచేతను
చిక్కులన్నితొలగిపోయి
సకలభాగ్యములు గడించి
శాంతి సౌఖ్యములు పొందును

సర్వేజనా స్సుఖినోభవంతు!
స్వస్తిసన్మంగళానిభవంతు!

కం॥ శ్రీమన్మంగళనామా!
ప్రేమామృతజలధిసోమ!
శ్రితకల్పద్రుమమా!
రామా! శ్రీ భద్రాచల
ధామా! ఈకృతిని గొనుమ
దశరథరామా!

## మంగళగీతి

మంగళమగుతను
మంగళమగుతను
మంగళకరుడగు సీతాలక్ష్మణ
సంగతుడగు భద్రాచల విభునకు
మంగళమగుతను
మంగళ మగుతను

శ్రీ కళ్యాణ గుణాభి రాముడగు
ఈ కృతి భర్తకు ఈకృతి కర్తకు
మంగళమగుతను
మంగళమగుతను
మహీజనాళికి మంగళమగుతను
మంగళమ్ మహత్. శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ





# రసప్రియ ఫోతేదార్ కేశవాచార్య

(Rtd. Chief Planning Officer / Dy. Director Planning & Statistics)

స్వగ్రామం : శ్రీరంగాపురం (వనపర్తి) మహబూబ్‌నగర్ జిల్లా.
అభిరుచులు : కవిత్వం,చిత్రలేఖనం, తత్వశాస్త్రం, చరిత్రపరిశోధన

రచనలు : శ్రీరసప్రియ రామాయణం (గేయకావ్యం) పర్ణశాల, (అరణ్యకాండ) సీతాన్వేషణ (కిష్కింధకాండ), సుందరకాండ, బాలకాండ, అయోధ్యకాండ - త్వరలో రాబోవు రావణవధ (యుద్ధకాండ), [illegible] శతకం, భద్రగిరి శతకం, మాతృశ్రీ, కేసరగిరి రామలింగేశ్వర నక్షత్రమాల, సీతారామతారావళి, [illegible] స్మృతులు (ఖండకృతి) అభ్యుదయ కిరణాలు (అముద్రితం) శ్రీ షిరిడీ సాయి చరితామృతము (అముద్రితం) శ్రీరంగనాథ శతకం, (అముద్రితం)

పర్ణశాల : సరళంగా గతివైవిధ్య తరళంగా రచించిన పర్ణశాల రసహృదయులకు ఆనందహేల. ఇందుకు కేశవాచార్య అభినంద్యులు — డా॥ సి నారాయణ రెడ్డి

సీతాన్వేషణ: నేటి హైందవ సమాజమునకు రామాయణ మహాభారత గాథలే పునరుజ్జీవన హేతువులు ఈ పరమార్థమును గ్రహించిన గ్రంథకర్త రామాయణ రచనను చేపట్టినందుకు వారిని అభినందించుచున్నాను. — గడియారం రామకృష్ణ శర్మ.

సుందరకాండ : అజరము, అమరము, రసప్రియ గేయరామాయణం. సర్వదాకృత కృత్యులైన శ్రీ రసప్రియగారు ఈ కావ్యరచన ద్వారా రససిద్ధులైనారు. తెలుగులోని శ్రీమద్రామాయణ కావ్యవారాశిలో అమూల్యమైన అనర్ఘరత్నం వీరి యీ సుందరకాండ. — మధురకవి కొలిపాక మధుసూదనరావు.

రసప్రియ రామయణం మహారాష్ట్రభాషలోని నరహరిదాసు రామయణానికి సాటిగా నిలుస్తుంది. — కపిలవాయి లింగమూర్తి

బాలకాండ : శ్రీరసప్రియ రచించిన రామాయణగేయకావ్యం తనసౌకుమార్యంతో ఆ బాల గోపాలము సలరించగలదని, తెలుగునేల నాలుగుదిశల ప్రసరించి భక్తిపర వశమొనరించి నాల్గుకాలములు నిల్వగలదని యాశించెద. — డా॥ మల్లాది గోపాలకృష్ణ శర్మ.

రసప్రియ ఫొతేదార్ కేశవాచార్యుల వారు వృత్తి రీత్యా సంఖ్యల వారు. వారిది అక్షరప్రవృత్తి. వారుగేయ బాలకాండ, వాల్మీకిని అనుసరించి రచించారు.

వాల్మీకి రామయణం వారికి అభిమానదైవం. వారికవితలో సౌలభ్యంఉంది. అర్థమవుతుంది చెప్పడం వారిలక్ష్యం. రసంవచ్చి చేరుతుంది.

ఈ కావ్యస్రష్ఠ రసప్రియ కేశవాచార్యులను వారికుటుంబాన్నీ సీతారాములు సంపూర్ణంగా అనుగ్రహించాలని ఆశీర్వదిస్తున్నాను. — డా॥ దాశరథి రంగాచార్య.